# స్వామి పలుకులు—

# స్వాతి చినుకులు

## 2 వ భాగం




కర్త

డా॥ మోపిదేవి కృష్ణస్వామి, ఎం. ఏ. పి. హెచ్. డి.

కూర్పు

మంత్రి

దియూనివర్సల్ హ్యూమానిటేరియన్

ఎడ్యుకేషన్ ట్రస్టు

ప్రథమ ముద్రణ : మేకాల్ 1990


వెల : 14-00

ముఖచిత్రం : బాలి

ప్రతులకు :
**మానవ ధర్మ శిక్షణ సంస్థ**
23-10-7 పురుషోత్తం వీధి,
సత్యనారాయణపురం
విజయవాడ - 11

ముద్రణ :
**విక్టరీ ప్రెస్,**
**విజయవాడ**



పుచ్చా పూర్ణానందంగారూ ! మునిమాణిక్యం తరువాత తెలుగు జాతికి దొరికిన మరో మాణిక్యం మీరు.

మీ హాస్యం ఉన్నదే అది సహజమైనది, సజీవమైనది, స్వ[illegible]నాత్మకమైనది. సంస్కారణ శీలం గలది.

మరువలేనివి మీ "మీసాల సొగసులు" వాటికి ముచ్చటపడి ఈ స్వామి పలుకులు స్వాతి చినుకులు మిమ్మల్ని వరిస్తోంది. స్వీకరించండి మీలాగా సరదాగా సా[illegible]ల్లుగా మా అందరినీ ఆశీర్వదించండి.

# ఇందులో


| అంశం | పుట |
| --- | --- |
| మాటలతో ఆటలు | 1 |
| పదాల నృత్యం చూద్దామా | 4 |
| బందేమాతరం | 10 |
| రాస్తారోకో | 10 |
| రిలే నిరాహార దీక్షలు | 11 |
| లలిత కళాతోరణం | 13 |
| పక్కా గృహనిర్మాణం | 13 |
| పూరీ ఎక్స్‌ప్రెస్ | 14 |
| పాస్లె | 15 |
| లైటోదయం | 16 |
| పవర్కట్ | 16 |
| రిస్క్‌గా | 17 |
| బారులు తీర్చి | 18 |
| కాస్తాగి వస్తాము | 19 |

13. పద్యకవిత్వంపోయి 19

14. చెంపూ కావ్యం 20

15. ఆడంబరాలు 21

16. కునేగా 22

17. లిప్‌స్టిక్ 23

18. ఈ రెండు ఆడవాళ్ళ పనులు 23

19. నవలాప్రక్రియ 24

20. దోమతెర 25

21. టార్టాయిస్ 25

22. దోగలు 26

22. డిలైట్ ఫొటోస్టూడియో 28

23. చెడగాన్ 29

24. ఫైవ్‌స్టార్ 29

25. కాంధారి 30

26. పబ్లిక్ స్కూలు 31

27. కాన్వెంటు 32

28. శనివారం 33

29 కంపల్సరీ పెళ్ళిళ్ళు 34

| | | |
|---|---|---|
| 30. | నూతన దంపతులు | 34 |
| 31. | అన్నమైనం | 35 |
| 32. | బెండ బొగ్గులు | 35 |
| 33. | భోజనాః | 37 |
| 34. | చాలా ఘనంగా | 37 |
| 35. | ఘీంకారము | 36 |
| 36. | కూరండీ | 38 |
| 37. | పప్పుకూర | 39 |
| 38. | మహానసం | 40 |
| 39. | ఫలహారం | 40 |
| 40. | ఒక్కరవ్వ | 42 |
| 41. | పుచ్చుకొందామని | 42 |
| 42. | వక్కలవాడు | 43 |
| 43. | మహాకాయాః | 43 |
| 44. | మంచంపీట | 44 |
| 45. | బల్లపరుపు | 45 |
| 46. | గుర్రు తీస్తున్నారు | 46 |
| 47. | చరమ సందేశం | 46 |
| 48. | ఇంకెవరికీ చెప్పొద్దు | 47 |

| | | |
|---|---|---|
| 49. | కోయదర | 48 |
| 50. | ఇంటర్నేషనల్ | 49 |
| 51. | మాస్టారు | 50 |
| 52. | నెప్ట్యూన్ | 51 |
| 53. | యాస్పెక్ట్ లేదంటే | 52 |
| 54. | నీ రాశి ఏదైనా | 52 |
| 55. | గురువును మించిన శిష్యులు | 53 |
| 56. | పంక్చ్యుయాలిటీ | 54 |
| 57. | రావుల్ తప్పెన్ | 54 |
| 58. | గోలా | 55 |
| 59. | ఏదో ఒకలా | 56 |
| 60. | లా వాక్కింతయు | 57 |
| 61. | ఏమండీ | 58 |
| 62. | మల్లెమొగ్గలు | 59 |
| 63. | పాదనమస్కారం | 59 |
| 64. | కాలదండం లేదు | 60 |
| 65. | వీలునుబట్టి | 61 |
| 66. | చిరాకు | 62 |
| 67. | పరాకు | 62 |

| | | |
|---|---|---|
| 68. | వారసత్వం | 63 |
| 69. | అరవిందు | 64 |
| 70. | ధర్మకాటా | 65 |
| 71. | ఇది ఏ కాఫి | 66 |
| 72. | నుస కాఫి | |
| 73. | స్టవ్ అంటే చిరాకు | 68 |
| 74. | ప్రాపర్టీ | 70 |
| 75. | ఉపద్రవం | 70 |
| 76. | ఓన్‌హౌస్ | 71 |
| 77. | అప్‌స్టేర్స్ | 72 |
| 78. | ఫ్యాన్ ఫ్యాన్ కోసమే | 73 |
| 79. | లాసన్స్ బే | 74 |
| 80. | కాలనీ | 74 |
| 81. | గరల్ | 75 |
| 82. | ఛీ, ఛీ | 76 |
| 83. | ఎక్సర్‌సైజ్ | 77 |
| 84. | మెదలు నొప్పులు | 77 |
| 85. | తగ్గుముఖం | 78 |
| 86. | ప్రమథ గణాలు | 79 |

| | | |
|---|---|---|
| 87. | తారుమారు | 79 |
| 88. | చెప్పు కరిచింది | 80 |
| 89. | తగినంత-తెగనంత | 81 |
| 90. | వారికి | 81 |
| 91. | ఇంటిమసి | 82 |
| 92. | ఆస్తిపరులు | 82 |
| 93. | తాట వలుస్తున్నారు | 84 |
| 94. | శంకరా! | 84 |
| 95. | ఎమికబుల్ | 85 |
| 96. | ఆజానుబాహుడు | 86 |
| 97. | నొక్కి చెప్పాలి | 87 |
| 98. | బంగారుకొండ | 88 |
| 99. | నీ ఋణం ఈ జన్మకు | 89 |
| 100. | అంతరాయం | 90 |
| 101. | రెక్కలు కట్టుకొని | 91 |
| 102. | ఆదరా బాదరా | 92 |

# మాటలతో ఆటలు

డా॥ మోపిదేవి కృష్ణస్వామి గారిలో ఒక అనుష్ఠాన వేదాంతి ఉన్నాడు. ఒక దేశభక్తుడున్నాడు. ఒక బోధకుడున్నాడు. ఒక ఘన వైద్యుడున్నాడు. ఒక సాహితీవేత్త వున్నాడు. ఒక మాటకారి గూడ ఉన్నాడు. బహుముఖాలుగా వెలుగులు విరజిమ్మే కాంతిపుంజం వారిలో కనిపిస్తుంది.

"స్వామిపలుకులు-స్వాతి చినుకులు" అనేది వారు మాటల నడుమ వెలువరించిన చెణుకులు, చమత్కారాల సంకలనం. గిలిగింతలు పెట్టే మాటల రవ్వలతోబాటు ఆలోచింపజేసే పలుకుల తీపు గూడ ఇందున్నది.

అన్ని ఆటలలోనూ నవ్వులాటే కష్టం. ఆ కష్టమైన ఆటను అవలీలగా ఆడి చూపారు రచయిత ఇందులో.

చాలామంది ఇంకెవరికీ చెప్పొద్దు అంటూ చెవిలో ఏదో పడేసి పోతుంటారు. దాని అర్థం ఇదట: "ఇంకెవరికీ చెప్పొద్దు అంటే నీవుగా శ్రమపడి ఇంకెవరికీ చెప్పొద్దు. ఆ శ్రమేదో నేనే పడతాను. పడదలుచుకున్నాను." అని అర్థం.

జాతక చక్రం చూచుకొని ఆదుర్దా చెందవద్దంటూ, "నిరాశ నీ దగ్గరకు చేరనంతవరకూ, నీ రాశి ఏదైనా వచ్చిన కష్టంది ఏమీ లేదు." అని వెన్నుతట్టి చెప్పారొకనికి.

రాస్తారోకో గురించి వ్యాఖ్యానిస్తూ "ఈ రాస్తారోకోలలో ఎక్కువ భాగం రేపు పేపర్లో మనను గురించి, 'రాస్తారాకో'. అని అనుకుంటూ చేసేవాళ్ళే" అన్నారు.

ఒకడికి జ్వరం వగైరాలు తగ్గి దగ్గు మాత్రం వస్తున్నది. అందుకు స్వామి "జబ్బు తగ్గు ముఖం పట్టేందుకు బదులుగా దగ్గు ముఖం పట్టిందన్నమాట!" అన్నారు.

"ఎక్సర్‌సైజ్ చెయ్యటం మంచిదే దాని వల్ల ఎక్స్‌ట్రాసైజ్ తగ్గుతుంది"— అన్నారు మరొక సందర్భంలో.

శనివారమంటే ఇక సినీవారమేనట. ఎందుకంటే ఎక్కడి వాళ్ళక్కడ టి.విలకు కరచుకుపోతూ ఉంటారట. సినిమా కోసం!

శిష్యుల గురించి మాట్లాడుతూ, "గురువును మించిన శిష్యుడైతే సంతోషమే. గురువును ముంచిన శిష్యుడైతేనే ప్రమాదం" అంటూ చమత్కరించారు.

ఎక్కడో గోల జరుగుతూ వుంటే, "గోల అంటే ఏమిటో తెలుసురా? "గోలా" అంటే "Go law" అంటే అక్కడ చట్టానికి చోటు లేదని అర్థం." అన్నారు.

భాగవతంలో చెప్పిన "లావొక్కింతయు లేదు" అనే మాటకు కూడా "law ఒక్కింతయు లేదు." అనే అర్థం తీశారు.

చిరాకు పడవద్దని ఒకరికి చెపుతూ, "చిరాకు వస్తున్నప్పుడల్లా ఛీ! రాకు! అని చెప్పు. అలా చిరాకు మీదనే చిరాకు పడ్డావనుకో. ఇక అది రాదు." అని బోధించారు.

"లిప్ స్టిక్" వాడితే ఏమవుతుందని ఎవరో అడిగితే "లిప్ క్రమంగా స్టిక్‌గా రూపొందుతుంది. అంటే ఏం లేదు. పెదవులు క్రమంగా కొయ్యబారుతాయి." అని వ్యాఖ్యానించారు.

హాస్యధోరణికి కొన్నిచోట్ల ఉపదేశం కూడా జోడించారు. "సామాన్యంగా అప్పు ఇవ్వకు. ఒకవేళ ఇవ్వవలసివస్తే ఈ డబ్బు నాది కాదనుకొని మరీ ఇవ్వు"— అని సలహా ఇచ్చారు.

ఇలా సాగిన వీరి "మాట కచ్చేరి" పాఠకులలో ఆలోచనల్ని రేకెత్తిస్తూనే అడుగడుగునా పళ్లు బయట పెట్టిస్తున్నది. వీరి లేఖినినుండి మరిన్ని చమత్కారాలు వెలువడగలవని ఆశిస్తాను. ఈ 'మాటలతో ఆటలు'లను రసవత్తరంగా కూర్పుచేసి మనందరికీ అందిస్తున్న 'మంత్రి' గారిని అభినందిస్తున్నాను.

4–5–90
గుంటూరు

ఇట్లు
మన్నవ గిరిధరరావు

# పదాల నృత్యం చూద్దామా

"స్వామి పలుకులు–స్వాతి చినుకులు" అన్న ఈ రచన సాహిత్యంలోనే ఒక నూతనమైన ప్రక్రియ. ఈ ప్రక్రియ ఎంత విలక్షణమైనదో, అంత విశిష్టమైనది. ఎంత సరసమైనదో అంతా సార్థకమైనది. ప్రాక్– పశ్చిమాలలో హాస్యరస ప్రధానమైన సాహిత్యాన్నంతా అవలోడనం చేసిన మీదట చెబుతున్న మాట ఇది. అంటూ తమ అభినందనలను అందచేశారు. శ్రీ గణపతిరాజు అచ్యుతరామరాజుగారు ఎనభై ఆరు, మేలో విశాఖలో గురుపూజా వేదికపైన మొదటిభాగాన్ని ఆవిష్కరిస్తూ. ప్రాక్–పశ్చిమాలలో ఇంతవరకు వ్యక్తమైన హాస్యరస ప్రధానమైన రచనా ప్రక్రియలన్నింటినీ సభకు వరుసగా పరిచయంచేసి, సమీక్షిస్తూ ఆయా ప్రక్రియల మధ్యలో ఈ స్వామిపలుకులు– స్వాతి చినుకులు ఎలాంటి విలక్షణతను, విశిష్టతను సంతరించుకున్నదో సోదాహరణంగా వివర్తించారాయన. మచ్చుకు కొన్ని చినుకులను సభకు రుచి చూపిస్తూ, "చివరకు ఇందులో "వక్క" పలుకునూ కూడ విడిచిపెట్టలేదు మాష్టరుగారు. దానితో కూడ సరసమాడారు. దీనిని బట్టి నా కనిపిస్తోంది కదా! మాష్టరుగారి పలుకులలో ఏ "ఒక్క" పలుకునూ కూడా మనం విడిచిపెట్టకూడదని. "ఆ శ్రద్ధ మనం వహించిననాడు దివ్యోల్లాసాన్ని అందించే ఇలాంటి విలక్షణ గ్రంధాలు లెక్కకు మిక్కిలిగా రూపు కట్టుకుంటాయి. అంటూ సోదర బృందాన్ని సరసంగా హెచ్చరించారాయన.

అలా అచ్యుత రామరాజుగారి చేతుల మీదుగా సమాజంలోనికి ప్రవేశించిన "స్వామిపలుకులు–స్వాతి చినుకులు" ఆయనన్నట్లుగానే ఒక ప్రత్యేకమైన సంచలనాన్ని సృష్టించాయని చెప్పవచ్చు. ఎందరో, ఎందరెందరో ఈ చినుకులను చదువుతూ మురిసిపోయేవారు, మురిసిపోతూ

ఇక మరచిపోలేనివారు ఆంధ్రదేశంలో ఎటువైపుకు వెళ్ళినా, అడుగడుగునా తారసపడుతూనే ఉంటారు.

ఒక చిత్రమైన సన్నివేశం. ఖమ్మంలో జరిగింది. 88 లో శ్రీరామనవమి నవరాత్రుల సందర్భంగా స్వామి ప్రవచన కార్యక్రమం అక్కడ జరుగుతూ ఉన్నది. ఒకనాడు ప్రవచనం పూర్తయిన తరువాత బసకు వచ్చి, స్వామి విశ్రాంతిగా కూర్చున్న వేళలో మధ్యతరగతికి చెందిన ఒక నడివయస్కుడు స్వామిని కలియవచ్చాడు. వస్తూ స్వామి పలుకులు–స్వాతి చినుకులు పుస్తకం తనతో తెచ్చాడు. స్వామికి నమస్కరించి, తానొక టీచరుననీ, తన పేరు గోవిందరావనీ పరిచయం చేసుకుంటూ, "మీ రచనలన్నింటిలోనూ నాకు "స్వామి పలుకులు-స్వాతి చినుకులు" బాగా నచ్చింది. నాకు తెలియక అడుగుతాను. ఇందులో వంద సన్నివేశాలున్నాయి కదా! వంద సన్నివేశాలలోనూ పదాల జంటలు వంద ఉన్నాయి. పదానికి తగ్గట్టుగా పదం. మళ్ళీ ఎక్కడా కావాలని వేసినట్లుగా ఉండదు. ఇది ఎలా సాధ్యమైందని నాకు ఆశ్చర్యం కలుగుతోంది. అంతకు మించిన ఆనందమూ కలుగుతోంది. అందుకే మీ రచనలన్నింటిలోనూ నాకు ఇది బాగా నచ్చింది" అన్నాడాయన.

స్వామి చిరునవ్వు నవ్వుతూ, మీరు "మాటలు-మంత్రాలు" చూశారా? అన్నారు.

"అదీ తీసుకున్నాను. అదీ ఒక విశిష్టమైన గ్రంథమే. అయితే దానితరహా దానిది. అందులోనూ పదముల వైచిత్రి వుంది. అయితే అందులో ఎక్కువ భాగం గంభీరంగా సాగింది. తాత్త్వికంగా, సందేశాత్మకంగా నడిచింది. నా మానసిక ప్రవృత్తికి ఈ చినుకులు బాగా నచ్చాయి. ఇందులోని ఈ సరసం నాకు బాగా నచ్చింది. గ్రంథం ఆసాంతం సరసంగా నడవడం, మీ నాలుకపై నుండి సాగిన ఈ పదాల

నృత్యం నాకు అపూర్వమనిపించాయి. అనితరసాధ్యంగా కనిపించాయి." అంటూ పారవశ్యంతో నమస్కరించి సెలవు తీసుకున్నాడాయన.

సెలవుతీసుకుని వెళుతున్న అతనిని కొద్దిక్షణాలపాటు అలాగే చూస్తూ కూర్చున్నారు స్వామి. అటుపైన ప్రక్కనున్న సోదరులవైపు చూస్తూ ఇలా అన్నారు: ఎవరి మనస్సుపైన ఏ ప్రక్రియ ఎంతగా ముద్ర వేస్తుందో ఎవరు చెప్పగలరు? ఇప్పుడు ఇతనికి ఈ గ్రంథం నచ్చింది. ఎంతగా నచ్చిందీ అంటే, ఇక్కడున్నంత సేపూ అతడు దానిని గురించే మాట్లాడాడు. అంతగా నచ్చిందతనికి. నాకనిపిస్తుంది కదా। వేద వ్యాస మహర్షి ఇందుకొరకే తన బోధను బ్రహ్మసూత్రాల నుండి భారత భాగ వతాల వరకు వివిధ ప్రక్రియల ద్వారా వ్యక్తం చేశాడు అని. మానవ మనస్తత్వాలలోని వైవిధ్యాన్ని అలరించడానికి రచయిత అయిన వాసు వ్యాస మహర్షిలా వివిధ రచనా ప్రక్రియలను చేపట్టడం కూడా ఎంతైనా అవసరమని ఇప్పుడీ సన్నివేశమే మనకు తెలియ జెబుతున్నది. అంటూ స్వామి జరుగ వలసింది చెబుతూనే, ఆ వచ్చినతను చెందిన అనుభూతికి ముచ్చటపడ్డారు. మొదటి భాగాన్ని చూసి ముచ్చటపడ్డ అతను, ఇప్పుడీ రెండవభాగం వెలువడుతున్నది. అంటె ఇంకెంతగా మురిసిపోతాడో। అతని లాంటి వారు ఎందరో ఎందరెందరో ఎదురు చూస్తూ ఉండటమే, ఈ రెండవభాగం ఇలా అచిర కాలంలో రూపు ధరించడానికి గల కారణమని చెప్పవలసి ఉంటుంది.

ఒక మహనీయుడు, అందరినీ ఆకర్షించే తన గొంతుతో వేదోప నిషత్తుల సారాన్ని లలిత, మధురంగా అందిస్తున్నాడు. పురాణేతిహాసాల లోని సార్వకాలీనము, సార్వ జనీనము అయిన సందేశాన్ని దేశ, కాల, పాత్రాలకు అనుగుణంగా మలచి, తన దైన బాణీలో వివరించడం ద్వారా ఆధునికులం, ఆధ్యాత్మికతకు విముఖులం అని అనుకునే ఈ తరం వారందరినీ, ఆశ్చర్యానుభూతులతో ముంచెత్తుతూ ఉత్తేజితులను చేసి

కర్తవ్యం వెంట నడిపిస్తున్నాడు. తనకు రూపుదిద్దిన దివ్యమూర్తి నుండి బహుధా వ్యక్తమవుతున్న వెలుగునకు వినమ్రుడై అంజలి ఘటిస్తూ, సకల మానవాళికి జీవాన్ని అందించే ఆ తేజస్సును తన దోసెళ్ళతో పట్టి పోస్తున్నాడు. తన చుట్టూ ఉన్న సమాజానికి సేద తీరుస్తూ, సేవచేస్తూ సందేహాలను తొలగించడం దగ్గరనుండి, సమస్యలకు పరిష్కారం చూపే వరకు సర్వమూ తానై మెలుగుతున్నాడు. వెలుగుతున్నాడు. సమాజాన్ని మునుముందుకు నడుపుతున్నాడు అలాంటి మహనీయుడు, తనకు సన్నిహితులైన వారితో ఎలా మెలుగుతాడో, ఎలా తిరుగుతాడో, వారి నెలా నవ్విస్తాడో, ఎలా కవ్విస్తాడో, రకరకాల సన్నివేశాలూ, పరిస్థితులూ ఎదురైనప్పుడు అతడెలా స్పందిస్తూ ఉంటాడో, విభిన్న మనస్తత్వాల వారు, తనకు చేరువైన వేళ వారితో అతడు ఎలా వర్తిస్తూ ఉంటాడో తెలుసుకోవాలని అనిపించడం ఎంతైనా సహజం. స్వామి విషయంలో సమాజానికికలిగే సహజమైన ఈ కోరికనుతీర్చడానికి "స్వామిపలుకులు-స్వాతిచినుకులు" చాల వరకు పనికివస్తుంది. అని అనిపిస్తుంది.

"మహనీయుల సందేశం జాతికి ఎంతగా పనికి వస్తుందో వారి జీవన సరళికూడా జాతికి అంతగానూ పనికివస్తుంది. ఒక్కొక్కప్పుడు అంతకన్నా ఎక్కువగా పనికి వస్తుందేమో కూడా! అందువల్ల మహనీయులైన వారి విషయంలో దివ్యమైన వారి సందేశాన్ని భద్రపరచుకోవడంతో పాటుగా, భవ్యమైన వారి జీవన సరళిని, రస వత్తరమైన మార్గంలో రికార్డు చేసుకోవడంలో కూడ మానవాళి శ్రద్ధ పెట్టవలసి ఉంటుంది. ఈ విషయంలో వాల్మీకి, వ్యాసులే మనకు ఆదర్శం. వారి రచనలకు మానవ సమాజంపైన ఇప్పటికీ అంతటి ప్రభావముండటానికి గల అనేక కారణాలలో ఈ జీవిత సందేశాలను సమన్వయించి, అందించడం అనేది కూడా ఒక ప్రధాన కారణం." అంటూ స్వామి ఒకప్పుడు పలికిన పలు

కులు నాకు ఇప్పుడు గుర్తుకు వస్తున్నాయి. నానుండి జరుగుతున్న ఈ కృషికి మరింత ప్రేరణను అందిస్తున్నాయి.

మహనీయుల మనస్సునకు సరస మాడటమనేది ఒక సహజ లక్షణంగా, భాసిస్తూ ఉండటం-అనాదిగా మానవజాతి గమనిస్తూ వస్తున్న అంశమే. మహనీయుల జీవిత సన్నివేశాలను, సంభాషణలను ఒక్కసారి ఈ దృష్టితో పరిశీలించి చూస్తే, సరస మన్నది వాటిల్లో అంతర్లీనంగా తప్పక గోచరిస్తుంది. నవ్వడం, నవ్వించడం. నవ్వుతూ బ్రతకడ మెలాగో నేర్పడం వారి జీవిత విధానంలోని ప్రధాన సూత్రంగా మనకు తప్పక గమనికకు వస్తుంది. నిరంతరం వత్తిడులకు లోనయ్యే మనస్సును ఆ వత్తిడులకు అతీతంగా నిలిపి నడిపించడ మెలాగో మానవజాతి వారి దగ్గర నేర్చుకోవలసిందే. కొద్ది సన్నివేశాలకూ, సమస్యలకే సామాన్య మానవులమైన మనం మానసికంగా వత్తిడులపాలై పోతాం. మరి మహనీయులు! వారికి చేరువైన వారందరి జీవితాలూ వారివే. అందరి సమస్యలూ వారివే. అందరి అవసరాలూ వారివే. మరి అలాంటప్పుడు వారెంతటి వత్తిడిని అనుభవించాలి. కానీ చిత్రం! వారలా వత్తిడిని అనుభవించడం లేదు సరికదా, తాము నవ్వుతూ, మనలను నవ్వించి ఇంటికి పంపిస్తున్నారు. ఒకసారి ఒకామె అన్నది; మాష్టరుగారూ! మీరు మరీను. అవతలి వాళ్ళు ఎలాంటి పరిస్థితులలో ఉన్నారనేది కూడ పట్టించుకోకుండా జోకులు విసిరేస్తూ ఉంటారు. నవ్వించేస్తూ ఉంటారు వాళ్ళని; అందుకు స్వామి ఇలా అన్నారు; బలేదానివిలే, అవతలివాడి పరిస్థితులను పట్టించు కుంటున్నాను కాబట్టే ఈ జోకులు విసరడం, పరిస్థితులకు అతీతంగా అతణ్ణి నిలబెట్టి నడిపించడం జరుగుతూ ఉన్నది. నిజానికి అతడు వచ్చేది అందుకే కదా! ఇలాంటి పరిస్థితులలో మాష్టరుగారి దగ్గరకు వెళితే ప్రాణం తప్పకుండా కుదుట పడుతుంది! అన్న ఆశతోనేకదా, అతడు వచ్చేది. మరి అతణ్ణి నవ్వించకపోతే ఎలా! విషయం ఆమెకు బోధపడింది.

## బందే మాతరం

"మనవాళ్ళలో దేశభక్తి మరీ కరువైపోతోంది. దేశ నాయకుల ఫోటోలు చూద్దామన్నా కనబడటంలేదు. పిచ్చి క్యాలెండర్లు మటుకు బోలెడు. అసలెక్కడయినా జాతీయ గీతమయినా వినబడుతోందా? కార్యక్రమం అయిన తరువాత పరిగెత్తుకు పోవడమే తప్ప ఈ స్పృహ ఎవరికి? పోనీ ప్రారంభించడమైనా "వందేమాతరం"తో ప్రారంభించవచ్చుకదా!" అంటూ వ్యథ చెందుతున్న వృద్ధుణ్ణి భుజం నిమురుతూ ఇలా అన్నారు స్వామి: ఇప్పుడెవరూ వందేమాతరం అనడంలేదయ్యా! "బందేమాతరం" అంటున్నారు. నిజమేగామరి. మీతరంలో "వందేమాతరం". మా తరంలో "బందేమాతరం." మా తరానికి బంద్‌లు తప్ప ఇంకేమి చేతకావడంలేదు. ఒకరకంగా చేత గానివాడు చేసేదేనేమో బంద్. మరి ఈ బంద్‌లకు బంద్ ఎప్పుడూ? బహూశా మా తరువాత తరంలో కావచ్చు.

"బాగా చెప్పావు. వందేమాతరం గేయం బందే మాతరంగా మారి పోయింది." "నిజమే బాబూ" అంటూ ఆ విషాదంలోనే నవ్వుకోడానికి ప్రయత్నిస్తున్నాడా వృద్ధుడు.

## రాస్తారోకో

"మొన్న ఒక రాస్తారోకో జరిగింది. ఇవాళ మళ్ళీ రాస్తారోకో అట. ఏమి రాస్తారోకోలో ఏమో! ఇటువంటివి ఎన్ని జరుగితే మాత్రం ఒరుగుతున్నదేమిటి?" అంటూ నిట్టూర్చారొకాయన.

ఆ నిట్టూర్పుకు స్పందిస్తూ స్వామి ఇలా అన్నారు: ఈ రాస్తారోకోలలో ఎక్కువభాగటి రేపు పేపర్లో మనసు గూర్చి "రాస్తారొకో" అని

అనుకుంటూ చేసేవాళ్లే. పీళ్ళత్త పేపరు పులులు అంటే పేపర్లలో మాత్రం పులులులాగా ఫోజులు పెట్టి ఫోటోలు వేయించుకుంటారు కాని పనులు మాత్రం ఎక్కడివక్కడే ఉంటాయి. వీటికి ఒక్కొక్క భాగం హావభావాలు, ఆర్భాటాలే పనులు జరుగడానికి కావలసినవి ఒకటి చిత్త శుద్ధి. రెండు సంకల్పశక్తి. మూడు కార్యదీక్ష. ఇవిమూడు కలిస్తేనే పనులు జరుగుతాయి లేకపోతే ఇలాగే పేపర్లలోపడి ఊసుకుంటాయి.

"బాగా చెప్పారు మాష్టరుగారు!" అంటూ సిట్టూర్చిన ఆ వ్యక్తి కోలుకోసాగాడు.

## రిలే నిరాహార దీక్షలు

"ఇప్పటికి నలభై రోజులనుండి నిరాహార దీక్షలు ఏకధాటిగా జరుగుతున్నా పట్టించుకునే నాథుడు లేడని బాధపడి పోతున్నారు వాళ్ళు. నిజమేమరి. నలభై రోజులంటే మాటలా!" అంటూ ఆశ్చర్యాన్ని వ్యక్తం చేయసాగారు ఎదురుగా కూర్చున్న యన.

ఆ ఆశ్చర్యాన్ని గమనిస్తూ స్వామి ఇలా అన్నారు. ఏమిటండీ నలభై రోజులంటున్నారు. నిరాహార దీక్షలు అంటున్నారు. ఇంతకూ జరుగుతున్న దేమిటి? దీక్షా, దీక్షలా?

"రిలే నిరాహార దీక్షలులెండి. రోజుకు కొంతమంది చొప్పున కూర్చుంటున్నారు. ఇదైనా మటుకు అంత తేలికా? చెప్పండి! ఎవరైతే మటుకు ఎన్నాళ్ళు నిర్వహించగలరు?"

స్వామి మళ్ళీ ఇలా అన్నారు చూడండీ! ఈరిలే నిరాహార దీక్షల్లో ఎక్కువభాగం డిలే నిరాహారదీక్షలే. మీరేం కంగారుపడనక్కరలేదు.

అంటే అన్నట్లుగా ఆశ్చర్యపడుతూ చూశాడతడు.

స్వామి ఇలా వివరించారు. కూర్చోబోయే ముందు కొద్దిపాటి తెలివి తక్కువ వాళ్ళను మినహాయిస్తే మిగిలిన వాళ్ళందరూ దండిగా స్వీకరించే కూర్చుంటారు. కూర్చున్న తర్వాత అలా అలా కాలక్షేపంచేసి అయి పోయిందనిపించి మళ్ళీ దండిగా స్వీకరిస్తారు. ఈ లోపల మళ్ళీ చిన్న చిన్న కక్కుర్తులు పడే వాళ్ళూ ఉంటారు. ఈ సందర్భంలో మహా అయితే ఏమవుతోంది. ఆహారస్వీకరణకి లేటు అవుతోంది. అందుకని రిలే అన్న పదాన్ని తొలగించి డిలే అన్న పదాన్ని చేర్చాను నేను. ఏమంటారు?

"మీరు భలే అబ్సర్వ్ చేశారే. ఇక్కడే ఉన్నట్లుంటారు. ఎక్క డెక్కడివి మీకు భలే తెలుస్తూ ఉంటాయే." అంటూ మురియసాగా డాయన.

"ఈ నిరాహార దీక్షల వంటి ప్రదర్శనల వెనక సమస్యను రచ్చ కెక్కించాలి అన్న ఉద్దేశం కనిపిస్తోంది తప్ప చాలా చోట్ల నిజమైన తపన కనబడటం లేదు. తపన లేనినాడు ఇంక సాధించ గలిగింది ఏముంటుంది. తపనకావాలి. తపన తపస్సు కావాలి. అప్పుడా తపస్సుకు ఫలితం తప్పకుండా ఉంటుంది. ఏమంటారు?" అన్నారు స్వామి.

మీ మాటలు అక్షరాలా నిజమండీ. అన్నారాయన. మీతో ఒక అంశాన్ని గురించి ప్రస్తావన తెచ్చాను అంటే ఆ అంశం యొక్క నిజ స్వరూపం మాకు అందిందన్న మాటే" అని మురిసి పోయారు.

## లలితా కళా తోరణం

ఈ ప్రభుత్వం కళలకు చాలా గొప్ప సేవ చేస్తుందని ఆశించారందరూ. కాని క్రియలో చూద్దుము కదా దానికి పూర్తి వ్యతిరేకం జరిగింది. ఆస్థాన కవులు, ఆస్థాన కళాకారులు అందరూ రద్దయిపోయారు. కళల కోసమేర్పడిన అకాడమీలు కూడా అన్నీ రద్దయిపోయాయి. ఏం చేసిందయ్యా మరి కళలకు అని అడిగితే లలితకళాతోరణమని అదొకటి మాత్రం ఏర్పాటు చేసిందని అంటున్నారు." అంటూ విరక్తి చెందుతున్నట్లుగా మాట్లాడాడొకాయన.

వారివైపు చూస్తూ స్వామి ఇలా అన్నారు: ఏమిటండీ ప్రభుత్వం ఏర్పాటు చేసింది. లలితకళాతోరణమా? లేక లలితకళలతో రణమా?

"బాగా చెప్పారు. మీరు అన్న ఆరెండోదే నిజం" అంటూ అంత విరక్తిలోను చిన్న చిరునవ్వు నవ్వాడాయన.

## పక్కా గృహ నిర్మాణం

అది విశాఖ పట్టణానికి ఒక వైపు పొలిమేర. ఒక సోదరుని ఇంటి నుండి బయలుదేరి, వెంటనడిచే బృందంతో ముచ్చట లాడుతూ కాలినడకన జంక్షన్ వైపుకు సాగుతున్నారు స్వామి. రోడ్డుకి ఒకవైపున పెద్దసంఖ్యలో నిర్మాణమవుతున్న బొమ్మరిళ్ళలాంటి ఇళ్ళు. అక్కడొక పెద్ద బోర్డు ఉంది. దానిపైన "పక్కాగృహ నిర్మాణ పథకము" అని ఉంది.

బోర్డుపైన ఉన్న అక్షరాలను అదోలా నొక్కి చదువుతూ ఇలా అన్నారు స్వామి ముసి ముసి నవ్వులు నవ్వుతూ "పక్కా గృహ

నిర్మాణ పథకము" అంటే ఏమిటో తెలుసునా! ఈ ప్రక్క కడుతుంటే
ఆ ప్రక్క పడిపోయేటట్లుగా కట్టగలం" అని

అంటూ గొల్లున నవ్వారు. మెతో సహా

## పూరీ ఎక్స్‌ప్రెస్

రైలు బెర్త్ పైన బ్యాగ్‌ను పడవేస్తూ "ఇంతకూ ఈ ట్రైను పేరేమిట్రా?" అంటూ అడిగారు స్వామి ప్రక్కనున్న యువకుణ్ణి.

"పూరీ ఎక్స్‌ప్రెస్" అన్నాడతను.

"పూర్ ఎక్స్‌ప్రెస్ అని పేరు పెడితే బావుండేదిరా దీనికి. ఇంత పరస్ట్‌గా ఉందేమిదిరా? మళ్ళీ అంత దూరం ప్రయాణం చేస్తోంది."

"సౌత్ ఈస్టర్న్ రైల్వే సౌత్ సెంట్రల్ రైల్వేల మధ్య నలిగిపోతూ ఉన్నదండీ ఈ ట్రెయిన్. వీళ్ళు పట్టించుకోవచ్చు కదా అని వాళ్లూ. వాళ్ళు పట్టించుకోవచ్చు కదా అని వీళ్లూ. మొత్తానికి ఎవరూ పట్టించుకోరు" అన్నాడాయువకుడు.

"పట్టించుకోవటం మానివేశారుగాని", అయినా కాడికి మనని ఎక్కించుకోవటం మాత్రం మానలేదు. నిజానికి దీన్ని పూర్ ఎక్స్‌ప్రెస్ అనడం కూడా చాలదు. సూపర్ లేజీ వాడినా మనం పడుతున్న బాధ తీరదు. సరే ఇక నువ్వు దీని పాపం అది కదులుతున్నట్లున్నది మన ప్రభుత్వ పరిపాలన, మన ప్రజల ప్రవర్తన ఎలా ఉన్నదీ గమనించు కోవడానికి వేరె సర్వే చేయనక్కరలేదు. ఒక్కసారి యీ ట్రెయిన్ ఎక్కితే చాలు" అంటూ, చేయి ఊపారు స్వామి.

# పాన్లే

రైలు బయలు దేరడానికి ఇంకా టైముంది. బెర్త్ పైన కూర్చుని ఉన్నారు స్వామి. అక్కడ అమ్మబడుతున్న పాన్ ఒకటి తీసుకున్నట్టు న్నారు. దానిని అటూ ఇటూ చూస్తున్నారు.

"ఏమిటి మాష్టారూ చూస్తున్నారు? అంతగా పరిశీలిస్తున్నారేమిటి!" అంటూ అడిగాడు అప్పుడే అక్కడి కొచ్చిన యువకుడు.

కుర్రవాడొకడు పాన్లే, పాన్లే అని అరుస్తూ అటు నుండి ఇటూ, ఇటు నుండి అదేపనిగా తిరుగుతున్నాడు. పోన్లే కదా అని తీసుకొని చూశాను. నాకాశ్చర్యం వేసింది. అందులో ఏం లేదు. రెండు పనికి రాని ఆకులు, ఒక తినరాని వక్కముక్క తప్ప. వస్తువులను అమ్మకుండా అమ్మినట్లుగా నటిస్తున్నారు వీళ్ళు. అమ్మకం పేరిట ఇక్కడ జరుగుతున్న దంతా నటనగానే ఉన్నది. పాలకుల పాలన దగ్గర నుండి యీ కుర్ర వాళ్ళ పానుల వరకూ అంతా నటనే. యీ నటన ఎలా ఉంటుందో చూద్దామనే కొన్నాను. దివ్యంగా ఉంది. రా కూర్చో! అంటూ ఆ యువకుణ్ణి కూర్చోబెట్టుకొని ఆ ఆకు వక్కను బయటకు విసిరేశారు. ఇవన్నీ వాళ్ళ కోసం అమ్ముతున్నారు. మనకోసం కాదు. అందుకని వాళ్ళ కోసం అంటే వాళ్ళు బ్రతకడం కోసం కొనాలి. మనకోసం అంటే మనం బ్రతకడం కోసం వాటిని దూరంగా పారేయాలి." అంటూ స్వామి గ్రంథపఠనంలో నిమగ్నమయ్యారు.

## లైటోదయం

అది విశాఖపట్నం, చినవాల్తేరులోని ఒకరి ఇల్లది. లోనికి ప్రవేశిస్తూ "పగటిపూట లైట్లన్నీ వేశారు. లైట్లన్నీ వేసినా ఇంకా చీకటిగానే ఉన్నట్లుందేమిటి? అన్నారు స్వామి ఆశ్చర్యపడుతూ.

"ఈ ఇంట్లో అంతేను మాష్టారూ. పగలూ, రాత్రీ భేధంలేకుండా లైట్లెప్పుడూ వెలుగుతూ వుండాల్సిందే. లేకపోతే అంతా చీకటే" అన్నది ఆ ఇంటామె.

"బాగున్నది. సూర్యోదయ, సూర్యాస్తమయాలతో పని లేదన్న మాట. ఇక్కడ మీకున్నదల్లా లైటోదయం, లైటాస్తమయం. బాగున్నది కథ" అన్నారు స్వామి.

ఏది భాగున్నా, ఏది బావుండకపోయినా మా ఇంటి పరిస్థితిపైన మీరు చేసిన కామెంట్ మాత్రం బాగుంది. ఇక ఈ కామెంటే మాకు ప్రతిరోజూ, అన్నివేళలా గుర్తొస్తుంది" అన్నదామె ఆనందంగా.

## పవర్ కట్

ఏమిటో ఈ పవర్‌కట్‌లకు అంతు కనబడటం లేదు. ముందు పగలన్నారు. తరువాత రాత్రి కూడా అని అనుకున్నారు. మధ్యలో మళ్ళీ మా ఇష్టం అని తోచినప్పుడల్లా తీస్తున్నారు. కరెంటును నమ్ముకొని ఏ పని చేయడానికి వీలులేకుండా ఉంది. అసలది ఉన్నా లేనట్లే అని పిస్తోంది. లేకపోతేనే నయమేమో. లేదని స్పష్టంగా తెలుస్తుంది " అంటూ వాపోయారు. అక్కడకు చేరిన సోదర బృందమంతా కలిసి స్వామి సన్నిధిలో.

అన్నీ వింటున్న స్వామి ఇలా అన్నారు. ప్రస్తుతం మన రాష్ట్రంలో ఏ ఇద్దరు కలిసినా కరెంటు టాపిక్ ఏమిటి? అంటే ఈ కరెంట్ టాపిక్కే. గవర్నమెంట్ పవర్‌కట్, గవర్నమెంట్ పవర్‌కట్ అంటున్నారు. చూడగా ఆ మాట వింటున్నప్పుడల్లా అసలు గవర్నమెంట్ పవరే కట్ అయిపోతున్నట్లు అనిపిస్తోంది.

ఈ సంభాషణ జరుగుతున్నప్పుడు నిజంగానే పవర్‌కట్ సమయం నడుస్తోంది. అయినా స్వామి చినుకులవల్ల కొంత ఊరట చెందినట్లు కనిపిస్తున్నది సోదరబృందం.

## రిస్కీగా

అర్జెంటుపని తగలడంతో అతణ్ణి మీ దగ్గర వదిలి వెళ్ళిపోవలసి వచ్చింది. అతనికి క్రొత్త కదా! అతనితో పాటు నేనూ మీ దగ్గర ఉన్నట్లు అవుతుంది అనుకున్నాను మొదట. ఎంతసేపున్నాడు మాష్టారూ అతను మీ దగ్గర అసలు. అతనితో మాట్లాడుతున్నపుడు మీకేమి రిస్కీగా అనిపించలేదు కదా!" అడిగాడు ఆ యువకుడు.

రిస్కీగా అనిపించలేదు గాని, కొంచెం విస్కీగా అనిపించింది నువ్వు ఉత్త అమాయకుడివోయ్. నీ దగ్గరకొచ్చేటప్పటికే అతడో పట్టు పట్టి వచ్చాడు. అది తెలుసుకోకుండా నీవిక్కడికి పట్టుకొచ్చావ్. అయితే అతడు మూడ్‌లోనే ఉన్నాడనుకో! నాకే అతనికి దగ్గరగా కూర్చోవడం కష్టమనిపించింది ఎలాగో అలాగ మానేజ్ చేశాననుకో. కాదు వెళ్ళిపోమంటే ఆ బాధతో మరికాస్త విస్కీ త్రాగుతాడేమోనని" అన్నారు స్వామి.

"నేను గమనించుకోలేకపోయాను మాష్టారూ. ఏ మాత్రం గమనించినా నేనసలు తీసుకు వచ్చేవాడినే కాను" అన్నాడు ఆ యువకుడు పశ్చాత్తాపంతో.

"అదేనోయ్ నేనంటున్నదీనూ. ఏది ఏమైనా మీకు లోకానుభవం పెరగవలసిన అవసరం మాత్రం చాలా వున్నది." అంటూ అతని వెన్నుతట్టారు స్వామి.

## బారులు తీర్చి

డిస్పెన్సరీ పూర్తయింది. సరస సల్లాపాలు సాగుతున్నాయ్. మధ్యలో మద్యపానం చోటు చేసుకుంది. "ఇదివరకు రోడ్డుపైన ఎటువైపు చూసినా కూల్ డ్రింక్ షాపులు కనబడేవి. ఇప్పుడు ఎటుచూసినా బారు షాపులే. ఇంకా చెప్పాలంటే అంతకన్నా ఎక్కువ సంఖ్యలో కనబడుతున్నాయ్. బారులను దాటుతూ కూల్ డ్రింక్ షాపు కోసం వెతుక్కోవలసి వస్తోంది. అంటే జనంబార్లకు ఎంతగా అలవాటుపడిపోతున్నారు." అంటూ వివరిస్తున్నాడొక సోదరుడు.

ఆ ప్రస్తావన నందుకుంటూ స్వామి ఇలా అన్నారు "అవును. భారతీయులు నేడు బారులు తీర్చి నిలబడుతున్నారు. నిలబడలేక తడబడుతున్నారు ఆ తడి కాస్త పడగానే. అక్కడే ఆ క్రిందనే పడుతున్నారు. అవును భారతీయులు నేడు బారులు తీర్చి నిలబడుతున్నారు."

కళ్ళకు కట్టినట్లుగా ఉన్నదా శబ్ద చిత్రం. ఆ చిత్రానికి పులకించిన సోదరులు, పులకిస్తూనే దేశపరిస్థితిని పరికిస్తున్నారు.తలలు పంకిస్తున్నారు.

## కాస్తాగి వస్తాము

మిత్రులొకరు సామాజిక పరిస్థితులను గూర్చి ముచ్చటిస్తున్నారు. వారి దృష్టి మద్యపానం పైకి వెళ్ళింది. "ఈ మధ్య తాగనివాళ్ళని వెతికి వెతికి పట్టుకోవలసి వస్తోంది. వందమందిని తీసుకొంటే అందులో పాతిక మంది పూర్తిగా కొట్టేసేవారే! ఒక యాభైమంది కంపెనీ సేక్ పేరిట కక్కుర్తి పడుతున్నవాళ్ళుంటారు? ఆ మిగిలిన పాతిక మందయినా నికార్సుగా మిగులుతారో లేదో తాగనివాళ్ళుగా."

ఆయన వాక్యాన్ని అందుకుంటూ స్వామి ఇలా అన్నారు. పూర్వం ఎవరికయినా ఏదైనా పని చెబితే కాస్తాగి వచ్చి చేసిపెడతాము అనేవారు. ఇప్పుడు కాస్త తాగి వచ్చి చేసిపెడతాము అంటున్నారు.

అక్కడ ఉన్న వారందరూ ఒక్కసారిగా నవ్వుల్లో మునిగి తేలారు.

తాను వర్ణింపదలచిన దృశ్యాన్నంతా స్వామి ఒక్కమాటలో, అదే ఒక్క ప్రాసలో ఇమిడ్చి చెప్పినందుకు ఆ వర్ణించుకుంటూ వస్తున్న మిత్రుడు ఆశ్చర్యానందభరితులయ్యారు!

## పద్యకవిత్వం పోయి...

"పద్యకవిత్వం రోజులు పోయాయి. పద్యాలు వ్రాసేవారి సంఖ్య తగ్గిపోయింది ఏవేవో రూపాల్లో కవిత్వం వ్రాస్తున్నారు. అందులో ఏ రూపాలు నిలబడుతాయో ఏమో చెప్పలేని స్థితి ఏర్పడుతోంది. అందులో కొన్ని కవితలసలు అర్థం కావు. ఇలా రూపమూ పోయి, అర్థమూకాక, ఎక్కడికి పోతున్నామా అనిపిస్తుంటుంది. ఇంతకూ పద్యకవిత్వముపోయి

ఆ తరువాత వస్తున్న ఈ కవిత్వాన్ని ఏమనాలి?" అంటూ వాపోయారొక సోదరులు.

చిరునవ్వు నవ్వుతూ స్వామి ఇలా అన్నారు. పద్యకవిత్వం తరువాత వస్తున్న ఈ కవిత్వాన్ని మద్యకవిత్వం అనొచ్చు. ఎందువలన అంటే ఈ వ్రాసే వారిలో ఎక్కువమంది మద్యప్రియులై వర్ధిల్లుతున్నారు కనుక. వారికి ప్రేరణ ఇచ్చేది అదే గనుక పద్యకవిత్వం పోయి మద్య కవిత్వం వచ్చిందని చెప్పవచ్చు! ఏమంటారు!

ఆ వాపోయిన ఆయనకు కూడా గిలిగింతలు పెట్టినట్లయింది.

## చెంపూ కావ్యం

"వచనకవిత్వం అంటున్నారు. మన పూర్వులు వచనాన్ని కవిత్వం కాదనలేదు కదా! చెంపూ కావ్యాల మాటేమిటి? కొంత పద్యం, కొంత వచనం. మరప్పుడు పద్యాన్ని వచనాన్ని సమానంగా చూసినట్లే కదా! ఇప్పుడు వచనంలో కవిత్వం వ్రాస్తున్నామంటున్నారు. వ్రాస్తున్న వారెంతమంది ఉన్నా, అందులో నిజంగా రాణిస్తున్నవారు ఒకళ్ళిద్దరే. మరికొందరు కొందరు వ్రాస్తునారు. ఆ లైను అక్కడికే ఎందుకు విరవాలి అన్నదానికి అర్థముండదు. ఇక ఏవో ప్రతీకలట. ఆ ప్రతీకలేమిటో ఆ రచయితలకే తెలియాలి. పూర్వుల కావ్యాల్లో అర్థం కానిది తక్కువ. వీళ్ళ రచనల్లో అర్థమయ్యేది తక్కువ. మరి అలాంటప్పుడు పూర్వులను కాదని వీళ్లు సాధించిందేమిటి? ఆ సాధించిందేమిటో బోధ పడటంలేదు." అంటూ నిట్టూర్చారొకరు స్వామిసన్నిధిలో.

స్వామి సరసంగా చూస్తూ ఇలా అన్నారు. చెంపూ కావ్యాలను కాదని ఇప్పుడొస్తున్న ఈ కావ్యాలను "చంపు"కావ్యాలు అనవచ్చు. మరి చదువరులను అర్థం కాకుండా చంపుతున్నాయి కదా ఇవి!

ఆ నిట్టూర్చిన సోదరులకు కూడా సరసమైన ఓదార్పొకటి లభించి నట్లైంది.

## ఆ డ ం బ రా లు

మాది కో - ఎడ్యుకేషన్ కాలేజీ కదా! ఒక సీనియర్ లెక్చరర్‌గా ఇప్పటికి ఇరవై ఏళ్ళ నుండి చూస్తున్నాను. డ్రస్సులు, ఫ్యాషన్ల విషయంలో మొగపిల్లలకన్నా ఎప్పుడూ ఆడపిల్లలదే పైచేయి. ఎప్పుడూ క్రొత్త డ్రస్సులే. క్రొత్త ఫ్యాషన్లే. ఇవాల్టికున్న ఫ్యాషను రేపటి కుండదు. ఎన్నెన్ని డిజైన్లు ఎంతెంతకథా. అసలా ఆడపిల్లల డ్రస్సులకే బోలెడంత ఖర్చవుతుందనిపిస్తుంది నాకు. చదువుకని పెట్టే పెట్టు బడిలో సగం పైన ఈ డ్రస్సులకే ఖర్చు అవుతుందేమో! అబ్బో! కాలేజీలో ఎటు చూసినా ఆడంబరాలతో నిండి పోయిన ఈ ఆడపిల్లలే. మరీ అంత ఆడంబరాలా?" అంటూ ఆవేదనపడుతున్న ఆలెక్చరర్ని ఇక టెన్షన్ పడనివ్వడం మంచిది కాదని స్వామి ఇలా అన్నారు. అసలు ఆడంబరాలు అన్న పదంలోనె మీరు చెప్పినదంతా ఇమిడిఉంది. ఆడంబరాలూ అంటే ఏమిటి? ఆడ-అంబరాలు. అంబరాలు అంటే వస్త్రాలు. ఆడంబరాలు అంటే ఆడవాళ్ళు కట్టే వస్త్రాలు. చూశారా! ఆడంబరాలన్నీ ఆడంబరాల్లోనే ఉన్నాయి. ఇక అందుకని ఏమాడంబ రాలు-ఏమా కథ అని మీరు విస్తుపోనక్కర్లేదు."

అనేటప్పటికి అందరూ ఒక్కసారి నవ్వులలో మునిగిపోయారు. ఆ లెక్చరర్ కూడా తగుమాత్రం రిలాక్సయ్యాడు. ఈ మాత్రం రిలాక్సేషన్ లేక పోతే కంటున్యూయస్ డిస్కషన్స్ తట్టుకోవడం కష్టమే మరి.

## కునేగా

"ఏమండీ మీరు దూరంగా కూర్చోండి" అన్నదామె.

తప్పదా అన్నట్లు చూస్తూ దూరంగా జరిగాడతడు.

"ఏమిటతన్నలా దూరంగా ఉంచుతున్నావ్?" అడిగారు అప్పుడే గది లోనికి ప్రవేశిస్తున్న స్వామి.

చూడండి! మాష్టారు ఈయన. నాకు పడదని తెలిసి కూడా సెంటు అదే పనిగా రాసేస్తున్నారు. ఇంకా ఆయనతో నాకెలా పడు తుంది చెప్పండి'" అన్నదామె. మూతి ఇటు నుండి అటు మూడు సార్లయినా త్రిప్పి వంటుంది అనే లోపం.

"ఇంతకీ ఏమి సెంటు వాస్తున్నాడమ్మా అతను?" అడిగారు స్వామి.

"కునేగా" అనే అదేవో ఉంటుంది చూడండీ అదీ!" అన్నదామె.

"అదా! దాని మీద 'కునేగా మరికొళుందు, అనిఉంటుంది' నువ్వు కునేగా మరికొనద్దు అని చెప్పు. సరిపోతుంది." అన్నారు స్వామి.

దంపతులిద్దరూ పకపకా నవ్వారు.

"నవ్వడం కాదోయ్. ఆమె చెబుతున్నదమలు చేయాలి" అన్నారు స్వామి.

"మీరు చెప్పిన తర్వాత ఇంకానా మాష్టారూ ? ఇంక అలాంటివి వాడను."

"అలా దారిలోకి వస్తారనే మీతో చెప్పాను మాష్టారూ" అన్నదామె.

"బాగుందమ్మా మీకథ" అన్నారు స్వామి.

## లిప్ స్టిక్

"మాష్టరుగారూ లిప్ స్టిక్ లవీ వాడవచ్చునాండీ?" అడిగిందొకామె.

"ఏం ఏమిటి విశేషం?" అడిగారు స్వామి.

"అదికాదండీ, అవి వాడితే ఏమవుతుందండీ?" అడిగిందావిడ.

"ఏమవుతుంది. లిప్ స్టిక్ వాడుతున్న కొద్దీ 'లిప్' క్రమంగా 'స్టిక్'గా రూపొందు తుంది. అంటే ఏంలేదు. పెదవులు క్రమంగా కొయ్యబారుతాయి. బండబారుతాయి. తమ సహజమైన నాజూకుతనాన్ని పూర్తిగా కోల్పోతాయి.

ఆ అడిగిన యువతికి స్వామి చెబుతున్న దృశ్యాలన్నీ సాక్షాత్కరించినట్లున్నాయి. ఆమె ముఖంలో అలాంటి జాడలు కనిపించసాగాయి.

## ఈ రెండూ ఆడవాళ్ల పనులు

చుట్టూ ముగ్గురు నలుగురు ముత్తైదువలు కూర్చున్నారు. స్వామి సహజ ధోరణిలో సల్లాపాలు సాగిస్తున్నారు.

ఒకామె అన్నది. మా ఆడవాళ్ళను ఉడికించడం తప్ప మీకు వేరే పని లేదా!

స్వామి ఇలా అన్నారు. ఉడకడం, ఉడికించడం ఇవి రెండూ ఆడవాళ్ళ పనులే.

"మీరు మరీ లోకువ కడుతున్నారు" అన్నదామె.

"లేదు లోకంలో జరిగేది చెప్పాను." అన్నారు స్వామి.

"మా విషయాన్ని రెండు మాటలతో తేల్చి పారేశారు. మీ మాటలకు తిరిగే ముంది కనుక." అంటూ స్వామి పాదాలకు నమస్కరించిందామె.

## నవలా ప్రక్రియ

"ఏమటండీ మాష్టరుగారూ! ఈ మధ్య స్త్రీ రచయితలే కన్పిస్తున్నారు ఎక్కడ చూసినా? నవలల విషయంలో మరీను. ఈ పత్రికల వాళ్ళు కూడా మరీ వెకిలి చేస్తున్నారు. ఆడవాళ్ళు నవలలే ఎక్కువ వేస్తున్నారు. చివరికి ఎక్కడిదాకా వచ్చిందంటే చేసేది లేక మొగవాళ్ళు కూడా ఆడవాళ్ళ పేర్లు పెట్టుకొని సీరియల్స్ వ్రాస్తూ ఈ పత్రికల్లో బ్రతుకుతున్నారు. పూర్వం కూడా ఉండే వాళ్ళుగాని స్త్రీ రచయిత్రులు ఇంతగా కనబడ్డ కాలాలు లేవు. మరి అందులోనూ నవలల విషయంలో ఏమిటండీ ఈ వైపరీత్యం?" అన్నాడొకాయన: ఐదుపదులు దాటిన వయస్సు. అన్ని విషయాలను తనవిగా పట్టించుకొనే మనస్సు.

చిరునవ్వు నవ్వుతూ స్వామి ఇలా అన్నారు. నవలల విషయంలో స్త్రీలు ముందుకు రావడం, ఆ ప్రక్రియలో వారిదే పై చేయి కావడం ఒక రకంగా సహజమే అన్పిస్తుంది! సంస్కృతంలో "నవలా" అంటే 'స్త్రీ' అని అర్థం. నవలా ప్రక్రియ అంటే అప్పుడు ఏమర్థం వస్తుంది? స్త్రీల ప్రక్రియ అని అర్థం వస్తుంది. మరి నీవు ఇందాకటినుండి ఊదర

పెడుతున్నదదేకదా! వాళ్ళ పై చేయిగా కన్పిస్తున్నారనేకదా! ఆనవలా అన్న శబ్దం ఈనవల అన్న ప్రయోగంతో శృతి కలిపినట్లుంది. అదీ సంగతి!"

మీరు బలే సమయస్ఫూర్తిగా సమర్థించారే. మీ చమత్కారం బావుంది. ఈ చమత్కారమే సత్యంగానూ కన్పిస్తుంది బావుంది నవలా ప్రక్రియకు మీ నిర్వచనం.



## దోమ తెర

రాత్రి 10 గంటలు దాటు తోంది. గది నిండా దోమలు. దోమల మధ్యలో మంచం పైన స్వామి. అప్పుడే ఏదో ఊరునుండి వచ్చారు. అప్పుడే వచ్చిన సోదరుడొకరు "మాష్టరుగారూ! దోమతెర ఉన్నదా!" అన్నారు.



స్వామి నవ్వుతూ! "దోమతెరలేదుగాని, నా చుట్టూ ఒక "దోమల తెర" ఉన్నది." అన్నారు.

ఇంతలో సహోదరుడొకరు టార్టాయిస్ వెలిగించి పట్టుకు రావడంతో దోమలు తెరగా ఉండటం మానేసి త్వరగా సర్దుకోవడం మొదలు పెట్టాయి.



## టార్టాయిస్

ఒక రోజు రాత్రి గదినిండా దోమలు. సంగీతాన్ని వినిపిస్తూ మీ సంగతేమిటో చూస్తామన్నట్లుగా అదేపనిగా ముసురుతున్నాయ్. కాళ్ళు, చేతులతో ఎంతగా అదిలించినా అవి ఎదురు తిరిగి అదరగొడుతున్నాయి.

స్వామి లేచి అలమరలో ఉన్న టార్టాయిస్ నందుకొని వెలిగించి

దోమలపైన సంధించిన విష్ణుచక్రమా అన్నట్లుగా నిలబెట్టారు. అది గమనించిన దోమలు ఇక ప్రక్కలకు సర్దుకోవడం మొదలు పెట్టాయి.

నవ్వుతూ అన్నారు స్వామి: ఈ ఊళ్ళో పిల్లలున్నారు చూశావా! ఆ పిల్లల్ని పిలిచి మీకు టాయిస్ కావాలా అని అడిగితే వాళ్ళేమంటారో తెలుసా "మాకు టాయిస్ వద్దండీ, అవకాశం ఉంటే టార్టాయిస్ ఇప్పించండీ" అంటారు.

ఆ చినుకుకు అందరూ చిరునవ్వులు చిందిస్తూ ఉండగానే ఎక్కడి దోమలు అక్కడ సర్దుకున్నాయి టార్టాయిస్ పుణ్యమా అని.

## దో గ లు

విశాఖపట్టణంలో తను గదిలో పనిలో ఉన్నారు స్వామి. దోమలు అదేపనిగా కుడుతున్నాయి. పగలు రెండు గంటలవుతోంది.

"ఇక్కడ పగటిపూట కూడా దోమలుంటాయేమిటండీ" అన్నారు సోదరులొకరు.

అంతేనంటే కాదు! ఇక్కడ దోమల సైజు చూశారా! ఎంతెంత ఉంటాయో?" అన్నారు మరొకరు.

వారి మాటలను అందుకుంటూ స్వామి ఇలా అన్నారు: ఈ దోమలది ఒక చిత్రమైన కథ. ఇవి హైబ్రిడ్ దోమలు. వీటిని దోమలు అనడం కన్నా "దోగలు" అనడం మంచిది.

"అంతే!" అన్నట్లుగా ఆశ్చర్యపడుతూ చూశారు అక్కడివాళ్ళు.

స్వామి ఇలా వివరించారు: మనను ఏడిపించడానికి పుట్టిన జాతులు ప్రధానంగా రెండు. ఒకటి ఈగలు, రెండు దోమలు. అయితే ప్రకృతి

మనని కరుణించి ఒక ఏర్పాటు చేసింది. ఈగలకు పగటిపూట, దోమలకు రాత్రిపూట కేటాయించింది మనలను ఏడ్పించడానికి. ఈ పద్ధతి వాటికి నచ్చలేదు. ఎప్పుడూ ఏడిపించగలిగితే ఎంత బాగుండును అన్పించింది వాటికి. అవి కలిసి మాట్లాడుకున్నాయి. ఈ రెండు జాతులమధ్య వివాహ సంబంధాలు ఏర్పాటు చేసుకోవడమే మార్గమని నిర్ణయించాయి. ఆ నిర్ణయం మేరకు జాత్యంతర వివాహాలు ప్రారంభమయ్యాయి. దోమలు, ఈగలు కలిసినవేళ, వాటి కలయిక ఫలించి దోగలు పుట్టుకొచ్చాయి. దోమలు-ఈగల బిడ్డలు కదా వాటిని దోగలు అని పిలవడం సముచితం.

ఇప్పుడీ దోగలు ఇటు పగలూ అటురాత్రికూడా మనను ఏడిపించడానికి కావలసిన సామర్థ్యాన్ని సంతరించుకున్నాయి ఈగలంత సైజును కలిగి దోమకైతే రెట్టింపు బాధను పెడుతున్నాయి. ఈ విధంగా దోమలు, ఈగలు కలసి కట్టుగా మనమీద కత్తిగట్టి వీటిని అనగా ఈ దోగలను కనిపెట్టాయి. ఇక మనం చేయగలిగిందిలేదు. వీటికి ఒళ్ళప్పగించడంతప్ప ఇక్కడ ఇంకో చిత్రముంది. దోమల్ని పోగొట్టే ఏ సరంజామా వీటిని పోగొట్టలేదు. వీటిని పోగొట్టడానికి ప్రయత్నించి ఆ సరంజామా తమ పరువును పోగొట్టుకుంది. ఇదీ దోగల కథ" అంటూ కథ ముగించారు స్వామి.

ఆసక్తికరంగా సాగిన కథనాన్ని, దోగల బాధను లెక్కచేయకుండా అందరూ విని ఆనందించారని వేరుగా చెప్పనక్కరలేదనుకుంటాను.

# డిలైట్ ఫోటోస్టూడియో

"ఫంక్షన్ ఫోటోలు బాగా వచ్చాయట. కాపీలు మరో నాలుగైదు రోజుల్లో ఇస్తామన్నారు." అన్నాడో యువకుడు.

"ఎవరు?"

"స్టూడియో అతను."

"ఏ స్టూడియో"

"డిలైట్ స్టూడియోనండీ!"

"అది దిలేట్ స్టూడియో. ఇవ్వక ఇవ్వక అక్కడే ఇచ్చారా ఆర్డర్? అతని ఫోటోలు చాలా బాగుంటాయి. అతని పద్ధతులు మాత్రం చాలా ఇబ్బందిగా ఉంటాయి. పెళ్ళికి తీసిన ఫోటోలు బారసాలకిస్తే అక్కడికి చాలా తొందరగా ఇచ్చినట్లే. ఆ దంపతుల షష్ఠిపూర్తికిచ్చినా మనం ఆశ్చర్యపోనక్కరలేదు. అందుకని డిలైట్ ఫోటోస్టూడియో కాదు, దిలేట్ ఫోటోస్టూడియో అంటూ ఉంటాను" అన్నారు స్వామి.

"ఎలా అయినా వెన్నాడి కాపీలు పట్టుకొస్తానండీ" అన్నాడతను.

"సరే ప్రయత్నించు. నిన్ను నేనెందుకు నిరుత్సాహపరచాలి? ఈ సారి వెళ్ళినపుడు మాస్టరుగారు మీ స్టూడియోకు ఈ పేరు పెట్టారండీ! అనికూడా చెప్పు. ప్రతిభకు అలసత్వం తోడైతే జనానికది ఇబ్బంది. అతణ్ణి వదులుకోలేరు. అతని చుట్టూ తిరగలేరు. ఈ మాటలు కూడా అన్నానని చెప్పు!" అంటూ ఆ యువకుణ్ణి సాగనంపారు స్వామి.

## చెడగాన్

విశాఖలో ఒకనాటి రాత్రి. హోటళ్ళ పైన సల్లాపాల నడుపుతున్నారు. ఏని ... ఏని "ఇంతకూ మంచి కాఫీ దొరికేటటువంటి హోటలు ఒక్కటైనా ఉన్నదా?" అడిగారు స్వామి.

"అన్నింటినీ కంపేర్ చేసి చూస్తే "చెడగాన్" బాగుంటుందని చెప్పవచ్చు మాష్టారూ! కాకపోతే దానికి కొన్ని వేళలుంటాయి. ఆ వేళలు దాటితే వాడు సర్వ్ చేయడు. ఆ విషయంలో చాలా స్ట్రిక్ట్‌గా ఉంటాడు." అంటూ దాని ప్రత్యేకతను కూడా చెప్పాడతను.

"బాగుందిరా! విశాఖ పట్టణమంతా చెడగా చెడగా చివరకు ఈ చెడగాన్ ఒక్కటి మిగిలిందన్నమాట!" అన్నారు స్వామి.

"బలే బాగుంది మాష్టారుగారూ! ఇది వాళ్ళకు బెస్ట్ కాంప్లిమెంట్" అంటూ మురిశాడతను.

## ఫైవ్ స్టార్

కారులో ప్రయాణం జరుగుతుండగా ప్రక్కన కూర్చున్నతను బయటకు చూపిస్తూ ఇది "స్టార్ హోటలండీ! ఈమధ్యనే కట్టారు" అన్నాడు.

"ఏ స్టారు" అన్నారు స్వామి.

"టూస్టారో, త్రీస్టారో అంటున్నారండీ!"

"నీవెప్పుడయినా వెళ్లావా?"

"లేదండీ!"

"నీలాంటి వాడొకడు భార్య పుట్టింటికి వెళ్ళినపుడు ఇలాంటి హోటలుకు వెళ్లాడట. వెళ్లేటప్పటికి వాడేంచేశాడూ డికాషను, పాలు, పంచదార

తెచ్చి ఎదరుగా పెట్టి వెళ్ళిపోయాడట. పీడాశ్చర్యపోయాడట! ఇదేమిట్రా బాబూ, కాఫీ కలుపుకోవడం చేతగాక మన దగ్గరకు వస్తే మళ్ళీ మననే కలుపుకోమంటున్నాడేమిటి అని. ఇదేదో మనింట్లోనే చేసుకుంటే పోయేది కదా! పీడే రుచిగా కలిపి ఇస్తాడని, పైగా ఇదేదో స్టారు హోటలు అంటున్నారు, ఇంకెంత బాగుంటుందో అని ఇక్కడకొస్తే మీ కాఫీ మీరు కలుపుకోండి అంటే చెప్పేదేముంది? ఇదే ఇలా ఉంటే ఇంక ఫైవ్ స్టార్ హోటలెలా ఉంటుందో! దానిలోనికి భోజనానికి వెళ్ళిన వాళ్ళకి ఒక స్టవ్, కొన్ని గిన్నెలు మంచి బియ్యం, కూరలు వగైరా ఎదురుగా పెట్టి వెళ్ళిపోతారేమో? ఏమిస్తారో ఏమో మనస్టారు మాత్రం బాగుండలేదు. మన సారా కాఫీ త్రాగే అవకాశం మాత్రం పోయింది అనుకుంటూ... అట్లాగే కలుపుకుంటూ ఏదో త్రాగాననిపించి ముడుపు చెల్లించి బయట పడ్డాడుట."

కారులో కూర్చున్న బృందానికి కావలసినంత కాలక్షేపం. ఇలా కనబడ్డ వాటి మీదల్లా చెణుకులు విసిరే స్వామి ప్రక్కనుండగా ప్రయాణంలో శ్రమ ఇంకేం తెలుస్తుంది. అసలు శ్రమ అన్నది అక్కడ ఎందుకుంటుంది.

## కాంధారి

"ఇటు సరాసరి వెళితే హోటలు కాంధారి వస్తుందండీ" అన్నాడు ఒక యువకుడు. విజయవాడలోని ఒకానొక జంక్షన్‌లో ఇద్దరు ముగ్గురు సోదరులతో కలిసి స్వామి నిలబడిన వేళ అది.

"ఏమిటా హోటలు? అడిగారు స్వామి.

"హోటలు కాంధారి అండి. ఈ మధ్యనే క్రొత్తగా కట్టారు." అన్నాడతను.

"కాంథారి! అది మనకు కాని దారి" అన్నారు స్వామి. ఒక్క క్షణం ఆగి మళ్లీ ఇలా అన్నారు. కాని దారి అని ఎందుకన్నానంటే అది కానీ దారి కనుక. డబ్బున్న వాళ్ళకు ఖర్చు పెట్టుకొనే చోట్లలో అది ఒకటి కనుక. ఇంతకూ మనదారి ఎటో చూడండి. మన కారు ఈ దారినే రావాలి కదా! ఇంకా రాలేదేమి?" అంటూ స్వామి అటు వైపుగా చూస్తున్నారు. సోదరులు ఆ చూపుతో శ్రుతి కలిపారు.

## పబ్లిక్ స్కూల్

"ఈ మధ్య ఇదో విచిత్రం. ప్రతి వాడూ ఏదో ఒక చిన్న ఇల్లో, ఇంకా చెప్పాలంటే ఇంట్లో ఒక చిన్న పోర్షనో తీసుకోవడం, అక్కడో స్కూలు పెట్టేయడం. అంతటితో ఊరుకోక దానికి పబ్లిక్ స్కూలు అని పేరు పెట్టడం. చూస్తేనేమో దానికి తాడుండదు, బొంగర ముండదు. అసలు పబ్లిక్ స్కూలు అంటే ఎలా ఉండాలి. దాని లెక్కేమిటి? అదేమయినా తెలుసా అని వీళ్ళకి." అంటూ ఒకాయన ఉద్వేగ పడుతున్నారు.

ఆ ఉద్వేగానికి స్పందిస్తూ స్వామి ఇలా అన్నారు. "మీ బాధ నాకు బోధపడింది. ఈ పెట్టే స్కూళ్ళకు కిటికీలుండవు. తలుపులుండవు. కొన్ని చోట్ల గోడలుండవు. అక్కడ జరిగేదంత పబ్లిక్‌గా అందరికీ కనబడుతూనే ఉంటుంది. పబ్లిక్ స్కూలు అన్న పేరు ఈ విధంగా దానికి సరిపోతుంది. ఏమంటారు.

"ఏమంటాను మీ నిర్వచనం చాలా బావుంది అంటాను. ఈ నిర్వచనాన్ని తెలియజేస్తూ ఉత్తరాలు వ్రాయాలని ఉంది ఆయా స్కూళ్ళకు. అప్పటికన్నా కాస్త బుద్ధి, వస్తుందని నా ఆశ." అన్నా రాయన.

ఆ అనడంలో ఉద్వేగంతో పాటు చిన్న చిరునవ్వు కూడా కని పించింది.

## కా న్వెం టు

ఏమికాన్వెంటు స్కూళ్ళో ఏమో! అనవసరమైన ఆర్భాటం, మరీ ఎక్కువైపోతోంది. యూనిఫారం అన్నారు బావుంది. మళ్ళీ టై ఉండాలట. అదెందుకు? ఉరిత్రాడులాగ. కాళ్ళకు చెప్పులు పనికిరావు. బూట్లుండాలి అన్నారు. పొరపాటున చెప్పులేసుకొని వెళ్ళితే ఇంటికిపంపించేస్తారు. అసలు విద్యాలయమంటె దేవాలయమనికదా! అలాంటి విద్యాలయంలో చెప్పులూ, బూట్లు ఏమిటి? అవసరమున్నా లేకపోయినా అనేక రకాల పుస్తకాలు. మళ్ళీ అన్నీ అక్కడే కొనాలి, భరించలేనంత. హోంవర్కు. నెలనెలకీ పరీక్షలు. అదేమిటంటే యూనిట్ పరీక్షలంటున్నారు. ఏం నెట్టడమో ఏమో! అంతా గోలగోల. పిల్లలకి తీరికుండదు. మనకీ తీరికుండదు." అంటూ వెష్టపడుతూ మాట్లాడుతున్నా రొకాయన.

ఆ అంశాలను వింటూ వస్తున్న స్వామి ఇలా అన్నారు. వాళ్ళ స్కూలు పేరేమిటి? కాన్వెంట్. కాన్వెంట్ అంటే కానివాని వెంటపడేది అని అర్థం. మనవి కానివాటి వెంటబడటమే ఆ స్కూళ్ళ స్పెషాలిటీ. కావాలంటే చూడండి. వాళ్లనుసరిస్తున్న పద్ధతులన్నీ మనవికానివే. ఆ వేషధారణ కానీ, ఆ బూట్ల గొడవకాని, ఆ బోధనాపద్ధతి కాని ఏవీ మనవి కావు. పిల్లలకు టెన్షన్ కల్గించే పద్ధతులన్నీ అవలంబిస్తున్నారు వీళ్ళు. పిల్లకాయల్ని నలిపివేస్తున్నారు. విద్యార్థులు వెలిగేటట్లుగా చూడటం భారతీయ మార్గం. విద్యార్థులు నలిగేటట్లుగా చేయడం ఈ కాన్వెంట్ల మార్గం. కనుకనే కాన్వెంట్ అంటే "కానివాటి వెంటపడేది" అని నేను చెప్పాను. ఏమంటారు?

మీ నిర్వచనం అపూర్వంగా ఉంది. ఇప్పటి ఈ కాన్వెంటులకు పక్కాగా సరిపోతుంది! అంటూ మురిసిపోయారాయన.

## శనివారం

"ఏమిటి మాష్టరుగారు, పెద్దసందడి లేదివాళ. ఎప్పుడు చాలా హడావిడిగా ఉంటుంది కదండీ! ఈ ప్రాంగణమంతా." అంటూ లోనికి ప్రవేశించారొకాయన.

చిరునవ్వుతో స్వామి ఇలా అన్నారు: ఇవాళ శనివారం కదా! శనివారం అంటే ఇక సినీ వారమే. ఎక్కడి వాళ్ళక్కడ టి.వీలకు కరచుకు పోతారు.

"నిజమే మాష్టరుగారు మీరన్నది. కాని, ఎలా చూస్తున్నారో ఏమో! ఆ టీ.విలో ఎప్పుడోగాని మంచి సినిమా రాదండీ!" అన్నాడాయన.

"మంచి చెడులతో నిమిత్తం లేదు. మంచో చెడో అది తెలుగు సినిమా అవునా, కాదా! అది చాలు మనవాళ్ళకి. ఊరికే తెలుగు సినిమా చూపిస్తూఉంటే చూడకుండా ఎలా ఊరుకోగలమని అలా అంటుకు పోతున్నారు. ఈ బలహీనతను గమనించి ఏదో ఒక సినిమాను వేసేస్తున్నారు వాళ్ళు. సినిమాపిచ్చి మనవాళ్ళకు కావలసినంత ఉందే అని గమనించి పిచ్చిసినిమాలేవో ఒకటి వేసేస్తుంటారు వాళ్ళు!" అన్నారు స్వామి.

"పోనీలెండి. ఈ సినీవారం పుణ్యమాఅని మీకు కాస్తంత రెస్ట్. ఈ విధంగా మనకు మంచే జరుగుతోంది!" అన్నాడాయన.

## కంపల్సరీ పెళ్ళిళ్లు

"ఏరా! ఏమిటి నీ సంగతి? నువ్వటు ఇంటిలోను సరిగ్గా ఉండ లేదట. ఇటు ట్రస్ట్‌కి సరిగ్గా రావటం లేదు. ఇక్కడున్నావని మీ వా అనుకుంటున్నారు. అక్కడున్నావని మనవాళ్ళనుకుంటున్నా ఇంతకూ తమరెక్కడ ఘోరించినట్లు?" అని అడిగారు స్వామి. ఎదుర తలవంచుకొని నిలబడ్డ యువకుణ్ణి.

నేల చూపులు చూస్తూ ఆ యువకుడు "రెండు, మూడు క ల్సరీగా వెళ్లాల్సిన పెళ్ళిళ్ళు తగిలాయండీ!" అన్నాడు.

"కొంపలో సరిగా ఉండవుగాని, నీకు తోడు కంపల్సరీ పె ళ్ళొకటి. ఇలాంటి ఆరోగ్యాన్ని పెట్టుకొని ఆ కంపల్సరీ పెళ్ళిళ్ళకెళ పోతే కొంపలేం మునిగిపోతాయిరా? బుద్ధి సరిగా లేకపోతే అన్నీ కంపల్సరీగానే కనిపిస్తాయి. కానీ ఇకపద. ఇకపైనైనా స ఉండు." అంటూ అతన్ని నవ్వేస్తూనే మందలిస్తూ పంపించారు స్వా

## నూతన దంపతులు

"ఇదండీ! మాస్టారూ! మా క్రొత్తకాపురం. కాపురం పెట్టిన క్రొ రోజులకే ఈ ఇంట్లో అడుగు పెట్టి మమ్మల్ని ధన్యుల్ని చేశారు. చా సంతోషంగా ఉంది" అన్నాడా యువకుడు.

స్వామి ఆ దంపతులతో ముచ్చటలాడుతూనే ఒద్దికగా ఉన్న ఆ ఇంటిని నలువైపులా కలియచూస్తున్నారు. వంటగదిలో అడు పెడుతూ "ఇంకా గ్యాసు అదీ తీసుకోవాలా? ఏమిటయ్యా?" అ అడిగారు.

"లేదు మాష్టరు గారు! ఆవిడకు గ్యాస్ అంటే భయం. ఒక నూతన్ స్టవ్" కొని పెట్టండి అలు అన్నది. అలాగేననికొని పెట్టాను. అన్నాడతను.

"బాగుందయ్యా! నూతన దంపతులే కాకుండా "నూతన్" దంపతులు కూడా అయ్యారన్నమాట మీరు" అన్నారు స్వామి

ఆ దంపతుల మనస్సులకు గిలిగింతలు పెట్టినట్లయింది ఆ క్షణంలో.

## అన్న మైనం

భోజనాలు నడుస్తున్నాయి. అన్నం వడ్డిస్తున్నావిడ స్వామి దగ్గరకు వచ్చినపుడు స్వామి పడుతున్న ఇబ్బందిని గమనించింది. ఏమాత్రం మెత్తబడినా ఇబ్బందిగా ఫీలవుతారాయన. పొడిపొడిగా ఉంటేనే ఆయన ఇష్టపడతారు.

"మాష్టరుగారు! ఇవాళ అన్నం కాస్త మెత్తబడింది కదండీ" అన్నదావిడ.

"కొంచెమేమిటి? బాగానే మెత్తబడింది దీనిని అన్నమైనం అనొచ్చు" అన్నారు స్వామి.

ఇక ఆపైన అందరూ ఏదండి! కొంచెం ఆ అన్నమైనం ఇటు పెట్టించండి!" అన్నారు.

## బెండ బొగ్గులు

భోజనాలు జరుగుతూ ఉండగానే ఇంకొక ఆమె స్వామికి చేరువై "మాష్టరుగారు! బెండకాయ కాస్త ఎక్కువ వేగింది కదండి వేపుడు చేదామని మొదలుపెట్టాను అదేమో కాస్త ఎక్కువవేగింది కాయేమో కాస్త

ముదురు వారింది. ఏమిట్రా అన్నీ ఇలా కలిసి వచ్చాయి  అనిపించింది. వచ్చీరాని వంటతో మిమ్మల్ని ఇబ్బంది పెట్టేస్తున్నారేమో మాష్టరుగారూ" అన్నది.

స్వామి ఇలా అన్నారు : వచ్చిన తర్వాత రానివంటైతే మాత్రం తప్పుతుందా? చెప్పు. ఇదొక వెరైటీ అనుభవం మనవాళ్ళందరికీ. చక్కగా అన్నమైనం. బెండబొగ్గులు. కాంబినేషన్ బాగుంది కదూ! ఇదిగో చూడు ఇవాళ తినడానికి కాస్త ఇబ్బందిగానే ఉంటుందిగాని, కొన్నాళ్ళు పోయిన తరువాత చెప్పుకోడానికి బావుంటుంది. అందుకని చకచకా ఒడ్డించేయండి మీరు ఏమిటని ఎవరైనా అడిగితే అన్నీ స్పెషల్సే అని చెప్పండి. అంటూ ఆట పట్టించారు స్వామి.

ఒక క్షణమాగి ఆ వడ్డించే వాళ్ళను కూడా అక్కడకు చేరనిచ్చి ఇలా అన్నారు స్వామి: "మీ మైనాలు, బొగ్గులు చూస్తుంటే నాకు చిన్నప్పటి సంగతులు గుర్తుకొస్తున్నాయి. చిన్నప్పుడు మా అమ్మగారు ఇంట్లోకి రాకూడని సమయాల్లో మా నాన్నగారు వంటచేసి పెట్టేవారు. ఆ మూడురోజుల్లో కనీసం ఒక రోజైనా బెండకాయ కూర వండేవారు అదీ ఇగురుకూరన్నమాట ఆ ముక్కలు సరిగా ఉడకవని అనుమానమో ఏమిటో వాటి మూనాన అవి ఉడుకుతూ ఉండగా పనివేళా వాటిని పట్టుకొని అట్ల కాడతో చిదుపుతూ ఉండేవారు. ఎక్కడన్నా ఒకటి రెండు ముక్కలు మిగిలిపోయినా మళ్ళీ ఆ ముక్కల మాట మరచి పోకుండా ఉడికే లోపల వాటిని పట్టుకొని మరీ చిదిపేవారు బెండకాయ కూర కాస్తా బెండమైనంగా రూపు ధరించేది. అయితే రుచి మాత్రం బాగానే ఉండేదనుకోండి.

చూశారా! ఇప్పుడా ఘట్టాన్ని ఎంత ముచ్చటగా చెప్పుకుంటూ న్నామో! అలాగే ఇప్పటి ఈ ఘట్టాలన్నీ కూడా కొన్నాళ్ళు పోతే తప్పకుండా ముచ్చటలుగా మారిపోతాయ్! ఏమంటారు?

"అనటానికేముంది. ఈ ఘట్టాలు కూడా ఎక్కడో పుస్తకాల్లో. కెక్కేటట్లు చూస్తారు మీరు దాంతో మా వంటల లీలలన్నీ అందరికీ ముచ్చట్లుగా మారతాయి" అన్నదొకామె.

"అలా మారాయే అనుకో. అప్పుడు మాష్టరుగారికే ఇబ్బంది. మాష్టరుగారి శిష్యులకి వంట ఇంత బాగా వచ్చునని చెప్పుకుంటారు." అన్నది మరొకామె.

అందరూ కాసేపలా సల్లాపాల్లో తేలియాడారు.

## భో జ నాః

"మీరసలు ఏమి తినడంలేదు. మరి ఇలా అయితే ఎలాః పనిచేయ డానికి మాత్రం ఓపికుండొద్దూ?" అన్నది ఒకామె బాలసగా.

స్వామి ఇలా అన్నారు: నా ఓపిక మీరే నేను భోజనం వాడినికాను భో జనాః అని పిలవడానికై దిగివచ్చినవాడిని. భోజనాః అంటే ఓ జను లారా! అని అర్థం. నేనలా పిలుస్తూనే ఉన్నాను. మీరంతా ఇలావచ్చి చేరుతూనే ఉన్నారు. ఇక ఈ భోజనమంటారా! ఇది నాకు మాత్రంగా చాలు! ఏమంటారు?

అనటానికి ఇంకేముంటుంది. ఆ చాతుర్యానికి ఆమె ఆశ్చర్యా నందాలలో మునిగితేలడం తప్ప.

## చాలా ఘనంగా

ఆత్మీయుల ఇంటిలో భోజనం చేస్తున్నారు స్వామి. రకరకాల పదార్థాలు చేశారు వాళ్ళు. భోజనం చివరికి వస్తోంది."

"చారున్నదా"? అడిగారు స్వామి.

"నీవేమయినా పేషెంట్‌వా?" అన్నా డవతలాయన.

"ఎందుకని అలా అంటున్నావ్?" అన్నారు స్వామి.

"చారు అడిగావ్ గా మరి. మా ప్రాంతంలో రోగులకు పథ్యం పెట్టేటప్పుడు మాత్రమే చారు వాడుతారు" అన్నాడాయన ఆటపట్టిస్తూ "బాగుందయ్యా! ఇలా ఘనంగా ఏర్పాటు చేయడమే నీ అలవాటన్న మాట. ఏర్పాట్లు చాలా ఘనంగా ఉన్నాయిలే కానీ!" అన్నారు స్వామి.

ఆయన కూడా నవ్వాపుకోలేకపోయారు.

## ఘీ ం కా ర ము

నలుగురితో కలసి భోంచేస్తున్నారు స్వామి. ప్రక్కన కూర్చున్న తను మెతుకులను కదుపుతూ కాలక్షేపం చేస్తున్నాడు.

"ఏంటయ్యా! ఏంకావాలిసినః" అన్నారు స్వామి.

"ఘీ" అండీ అన్నాడతను సరదాగా చూస్తూ.

"చూశారండీ! ఇతడిక్కడ ఘీంకారం చేస్తున్నాడు. మీరు వినిపించుకోకపోతే ఎలాగ?" అంటూ నేతి వారిని అక్కడికి రాబట్టారు స్వామి.

ఆ కుర్రవాడు సరదాగా మాట్లాడే స్వామితో సరదాగా మాట్లాడుదాం అనుకున్నాడు. అంతకన్నా సరదాగా స్వామి అతని పైని చినుకు చిలికారు.

## కూ రం డీ !

భోజనాలు జరుగుతున్నాయి అన్నిపదార్థాలను అటుంచి కూర వడ్డించే వాళ్ళెక్కువగా కనబడుతున్నారు. అక్కడున్న వాళ్ళకేం కావాలో పట్టించుకోకుండా "కూరండీ, కూరండీ" అని తిరుగుతున్నారు.

ఈ దృశ్యాన్ని గమనించిన స్వామిప్రక్కనున్న వారిని చూస్తూ "వాళ్ళు కూరండీ. కూరండీ, అంటున్నారు ఇక మీరు మాత్రం ఏం

చేస్తారు. అయినకాడికి అదే కూరండి మరి." అని అంటూనే "ఏది బాబు, ఆ కూరే కొంచెమిటు వేయి నాయనా!" అనికూడా అన్నారు.

వడ్డనలోని లోటును ఈ చినుకుతో మరచిపోయారు అక్కడి వాళ్ళు.

## పప్పు కూర

ఒకసారి భోజనాల దగ్గర సల్లాపాలు నడుస్తున్నాయి. పప్పు కూరను కలుపుతూ ప్రక్కవారితో ఇలా చెప్పారు స్వామి. విశాఖలో చదువుకునేటప్పుడు నేను, మాతమ్ముడు ఒక రూమ్‌లో ఉండేవాళ్ళం. మా తమ్ముడు వంట చేసేవాడు. బాగాచేసేవాడు. మంచి పొదుపరి. అన్నయ్యా! ఈ పూట ఏం చేయమంటావని అడిగేవాడు .పప్పు, కూర, పచ్చడి చేయమని చెప్పేవాడిని. భోజనందగ్గర కూర్చునేటప్పటికి మూడు ఐటమ్సుకు బదులు రెండే కనబడేవి. పప్పు కూర అన్నవాటిని పప్పుకూర తినే ఒక ఐటమ్‌గా వాడు రూపొందించేవాడు. బలే చమత్కారం చేస్తున్నాడే వీడు అనుకునే వాడిని. చూశారా! అతనేం చేశాడో. ఇటు నా మాటను పాటించినట్లూ అయింది. అటు వాడికి పదార్థాలు ఆదొచ్చినట్లు అయ్యింది.

"మీ కథబావుంది. కాని ఈ కథ బావుండలేదు. ఆ కథలో ఉండి పోయి మీరసలు అన్నమే తినడంలెదు."అన్నది వడ్డిస్తున్న సోదరి.

"ఆగుమరి! ఈ లోకంలోకి ఇప్పుడేకదా వస్తున్నాను" అంటూ స్వామి భోజన వేగాన్ని పెంచసాగారు.

## మ హా న స ం

"వంటచేయడమంటే అంత హడావుడి చేయాలా? ఒక్కటే చప్పుళ్ళు, మోతలు. అంతా చికాకు చేసేస్తుంది. ఇంక ఆ సమయంలో పిల్లలక్కడకు వెళితే ఇక చెప్పనక్కరలేదు. వాళ్ళపని అయిపోయినట్లే ఏమిటీ అని మనం పరామర్శించపోయామో ఇక మన పనీ అయిపోయిం దన్నమాటే. అది వంటిల్లా? యుద్ధరంగమా? అనిపిస్తుంది. ఆ సమ యంలో ఆ మనిషిని చూడాలంటే భయం వేస్తుంది". అంటూ చెప్ప కొస్తున్నాడొకాయన.

మధ్యలో బ్రేక్ వేస్తూ స్వామి ఇలా అన్నారు : అలాంటప్పుడు చూడకూడదు, కలుగజేసుకోకూడదు. వాళ్ళమానాన వాళ్లనలా వదిలేయాలి అందుకే మన పూర్వులు ఇల్లు వేరే, వంటిల్లు వేరే కట్టేవారు. ఇవన్నీ ఆలో చించే వంటింటికి మహానసమని పేరు పెట్టి ఉంటారు. మహానస మంటే మహా "నస" వ్యక్తమయ్యే చోటన్నమాట. అలా అర్థం చేసు కోవాలి మనం. అలాంటి అర్థం తీసుకోవాలి.

ఆ చెప్పుకుంటూ వస్తున్న సోదరుడు ఇక చెప్పడానికి స్వస్తిచెప్పి నవ్వుకోసాగాడు.

## ఫ ల హా ర ం

రాత్రి తొమ్మిది దాటుతోంది. గదిలోనికి ప్రవేశిస్తున్న యువకుని వైపు చూసి ఏమోయ్ భోజనమైందా?" అని అడిగారు స్వామి.

"ఇవాళ భోజనం కాదు మాష్టారు. ఫలహారం చేసి వచ్చాను" అన్నాడతను.

"ఏం ఫలహారమోయ్?" మళ్ళీ అడిగారు స్వామి వదిలిపెట్ట కుండా.

"ఏం లేదండి. పులిహోరండి" అన్నాడతను.

"తిన్నది పులిహోర అయితే మరి ఫలహారమని చెబుతావేంటోయ్. ఇంకా చెప్పదలచుకుంటే "పులిహారం " అని చెప్పాలి. ఏమంటావ్?"

"ఫలహారం అని జనరల్‌గా అలా అనేస్తూ ఉంటారు కదండీ! అన్నాడతను.

"అందుకే అడిగింది. నువ్వుకూడా జనరల్‌గానే అన్నావా లేదా? అని. ఫలహారం అంటే అంటే అయినకాడికి అన్నీ కొట్టేయడమని కాదు అర్థం. తగుమాత్రంగా పళ్లు తిని పడుకోవడమని అర్థం. అలా తిని పడుకుంటే ఎక్కడ పడిపోతామో అని, మనవాళ్లు ఫలహారం అనే పదం క్రిందకి ఒక్క అన్నం మినహా అన్నీ చేర్చేసారు. అన్నం కూడా ఇప్పుడు నువ్వు తిన్నట్లు ఇంత పసుపు వేస్తే పులిహోరయి పనికొస్తుందన్నారు. అన్నాన్ని భిన్నం చేస్తే అసలు దోషమే లేదన్నారు. ఉప్మా, ఉప్పిండి చేసుకొని లాగించేస్తారు. చూశావా ఈ చిత్రం. మనవాళ్ళు అన్నం తినకుండా ఉండలేరోయ్! అందుకని అన్నానికి రకరకాల వేషాలు వేసి ఫలహారం క్రిందే చెలామణి చేసే లౌక్యాన్ని కనిపెట్టారు. వీళ్ళ. మా ఫ్రెండొకడుండేవాడు. శనివారం వస్తే ఫలహారం కదా అని సంతోషించేవాడు. ఏమిట్రా ఆ సంతోషమని అడిగితే అతడేం చెప్పేవాడో తెలుసునా? రోజూ భోజనం చేస్తున్నాం కదా! శనివారం వస్తే వెరయిటీగా రకరకాలు తినే అవకాశమొస్తుంది అనేవాడు. అనడమేమిటి? శనివారం కోసం ఎదురు చూస్తూ, ఆ రోజున తినదలచుకున్నవన్నీ తినేసేవాడు. అదేం శనివారం. తినువారం అయి కూర్చుంది. అదీ ఫలహారం కథ.

ఆ యువకుడికి ఫలహారం అనేటప్పటికి పులిహారం గుర్తుకొచ్చింది కాబోలు. ముసి ముసి నవ్వులు నవ్వుతూ తలదించుకున్నాడు.

## ఒ క్క ర వ్వ

సాయంత్రం నాలుగు గంటల వేళ. సోదరి ఒకామె స్వామికి మిగిలిన బృందానికి వేడి వేడి ఉప్మాను టిఫిన్‌గా అందించింది. బాగున్నది అని తింటున్నవారిని మరికాస్త తినిపించే ప్రయత్నం చేస్తున్నది. ఆ ప్రయత్నంలోనే స్వామి వైపు చూస్తూ "మాష్టరుగారూ! ఒక్కరవ్వ" అన్నది.

చాలు! అనట్లు తలాడించారు స్వామి.

"అదికాదు మాష్టరుగారూ! ఒక్కరవ్వ" అనది ఆమె. మళ్ళీ స్వామి నవ్వుతూ ఇలా అన్నారు. : ఒక్కరవ్వ, ఒక్కరవ్వ అంటూ బలవంత పెడతావేమిటీ? అందులో ఉన్నది ఒక్క రవ్వేగా! ఇంకేమున్నది?

ఆమెకు పగలబడి నవ్వాలనిపించింది. అది మర్యాద కాదని అణుచుకుంటూ "చివరకు ఈ ఉప్మా కూడా దొరికిపోయింది. ఒక్క రవ్వని నేనంటే అందులో ఉన్నది ఒక్కరవ్వేగా అని మీ శ్లేష, చమత్కారాలను చూపిస్తారా" అంటూ మురిసిపోయింది.

## పుచ్చుకొందామని

"ఏమిటయ్యా! అక్కడాగిపోయావు?" అడిగారు స్వామి.

"పూరలు పుచ్చుకొందామని"... అంటూ నసిగాడు అతను.

"ఏమిటీ పుచ్చు కొందామని ఆగావా!" అన్నారు స్వామి.

అతడికి బోధపడేటప్పటికి కొన్ని క్షణాలు పట్టింది. బోధపడిన క్షణాల్లో ఇక నవ్వు వచ్చేసింది. "లేదు మాష్టారూ! పుచ్చువికావు, మంచివే పుచ్చుకొందామని ... "అన్నాడతను.

"అదే లేవయ్యా! నీవు మంచివని పుచ్చుకొస్తుంటే అవి పుచ్చువై కూర్చుంటున్నాయని మీ ఆవిడ చెప్పింది. కూరలు తీసుకోవడానికి కూడా చాలా అనుభవం ఉండాలయ్యా! నేను చూడు ఎందుకయినా మంచిదని అసలలాంటి వాటిల్లో కలుగజేసుకోను! సరేలే పద! నిన్ను కలుపుకొని బయలు దేరాలని ... నీవేమో ఇక్కడె ఆగిపోయావు." అంటూ ముందుకు సాగారు స్వామి.

## వక్కల వాటు

రచనా వ్యాసంగంలో ఉన్నారు స్వామి. డిక్టేషను ఇస్తూ మధ్యలో ప్రక్కనున్న డబ్బాలో నుండి తీసి వక్క పలుకు నోట్లో వేసుకుంటున్నారు.

"మీకూ వక్క అలవాటు ఉందాండీ!" అన్నాడొక సోదరుడు.

"ఈ వక్కలవాటే ఉన్నదయ్యా" అన్నారు స్వామి.

ఒక్క క్షణం పట్టింది. అందులోని స్వారస్యం అతనికి అందే టప్పటికి.!

## మహాకాయా!

"పాపం! ఆయన ఆ శరీరాన్ని ఎలా మోస్తున్నాడో ఏమో!" "ఆయన మోసేమాట ఎలా ఉన్నా ఇప్పుడాయనన్నా కుర్చీ మోయొద్దూ? కుర్చీని చూస్తుంటే జాలివేస్తుంది. ఏమంటావురా?" అన్నారు స్వామి. సభలో మొదటి వరసన కూర్చొని ప్రక్కనున్న యువకుడితో.

కొద్ది క్షణాలలో ఈయన కూడా వెళ్లి ఆయన ప్రక్కనే కూర్చో వాలి. ఆ లావుపాటి అయన ప్రక్కకు వెళ్లి కూర్చునేలోపున ప్రక్క నున్న యువకునిపై చినుకులు కురిపిస్తున్నారు స్వామి.

స్వామి మళ్ళీ ఇలా అన్నారు: ఆ స్వాగతం పలికే ఆయన ఈ అధ్యక్షుల వారిని మహాశయా అనే బదులు "మహాకాయా" అని సంబోధిస్తే సార్థకంగా ఉంటుంది కదూ! ఆగు! ఆ మహాకాయుడు మనవైపు చూస్తున్నాడు. ఇంకా కొంచెం సేపట్లో మీరూ నా దగ్గరకు రాబోతున్నారు కదా అని. ఆయనకు దగ్గరయితే ఫరవాలేదు. ఆయన లావుకు కూడా దగ్గిర వాళ్ళమయితేనే కష్టం. అవునురోయ్! అన్నట్టు ఈమధ్య మనకు కూడా ఒళ్లు వస్తున్నట్లుంది. కొంపదీసి మన చెణుకులు మనకే వర్తించవు కదా! ముందు ముందు," అంటూ నవ్వుల జల్లుల్లో ప్రకరిస్తున్న వారిని ముంచెత్తుతుండగానే వేదిక మీదకు రావలసిందిగా స్వామికి పిలుపొచ్చింది.

## మంచం పీట

డిక్టేషన్ జరుగుతోంది. ఇంతలో ఎవరో వచ్చినట్లైంది. ఎవరది చూద్దామని లేవబోతున్న నన్ను ఆపి స్వామి తలుపు దగ్గరకు వెళ్లారు. కొద్ది క్షణాల తరువాత డిక్టేషన్ కంటిన్యూ చేస్తున్నారు.

కొంచెం విరామం చూసుకొని "ఎవరా వచ్చింది? లోపలికి వస్తారా? ఇక్కడొక కుర్చీ తెచ్చి వేయమంటారా!" అని అడిగాను నేను.

"కుర్చీ చాలదు. కుర్చీ పీటా చాలదు. ఆ వచ్చినాయనకి మంచం పీట కావాలి" అన్నారు స్వామి.

నేనాశ్చర్య పడ్డాను.

అది గమనించిన స్వామి మళ్ళీ ఇలా అన్నారు: నిజం! మంచం పీటే కావాలి. అంటే ఒక పెద్ద మంచాన్ని పీటగా స్వీకరించ గలిగిన వాడా వచ్చినాయన. అది ఎలాగో ఇక్కడ సాధ్యం కాదు కనుక

బయట బెంచీపైన కూర్చుండ బెట్టాను. ప్రస్తుతానికి ఆ బెంచీ పీట సరి పోయింది. ఇంకొంత కాలమాగితే అది కూడా చాలదు." అంటూ స్వామి మళ్ళీ డిక్టేషన్ కంటిన్యూ చేశారు.

## బల్లపరుపు

వేదిక మీద నిలబెట్ట బడిన మైకులు మాటి మాటికి ముందుకు పడుతున్నాయి శాంతి సత్సంగం వారి వార్షికోత్సవ సభ అది. ప్రక్కనే ఆలపాటి రామారావుగారు కూర్చుని ఉన్నారు.

"రామారావుగారూ! ఈ వేదికను ఎలా రూపొందించారు?" అడిగారు స్వామి.

"ముందు పెద్ద బల్ల వేశారండీ. దానిపైన ఆ బల్లకు సరిపడా పరుపు వేశారండీ!" అన్నారాయన నవ్వుతూ.

"బావుంది. బల్లపైన పరుపు వేశారన్నమాట. బల్ల పరుపుగా రూపొందించాలని చూశారన్నమాట." అన్నారు స్వామి.

రామారావుగారు ఫక్కపకా నవ్వేశారు.

స్వామి మళ్ళీ ఇలా అన్నారు. బల్ల పరుపుగా మీరు రూపొందించ లనుకున్నా ఇది రూపొందలేదే. ఇదంతా ఎత్తు పల్లాలుగా ఉంది. చూడండి! ఈ మైకులెలా పడిపోతున్నాయో! ఇదేం బల్ల పరుపండి బాబూ.

ఆలపాటి వారి నవ్వులకు ఇక అంతులేదు.

"స్వామిగారూ! మా వేదిక కూడా మీ ప్రాసలలోకి ఎక్కేసి దండి ఆరకంగా ఇది పుణ్యం చేసుకుంది." అంటూ మురిసిపోయా రాయన.

## గుర్రు తీస్తున్నారు

ఇందాకొక పెద్దాయన వచ్చారు. మీరేమో మంచినిద్రలో ఉన్నారు. గుర్రుకూడా పెడుతున్నారు. లేపడానికి ప్రాణమొప్పక "కాసేపాగిరండి!" అని సున్నితంగా చెప్పిపంపిచాను." అనిచెప్పాడొక యువకుడు; అప్పుడే నిద్రలేచిన స్వామితో.

బడలికతో ఒడలు విరుచుకుంటూ స్వామి ఇలా అన్నారు: గురువు గారు ఏం చేస్తున్నారూ అంటే గుర్రు తీస్తున్నారని చెప్పావా? ఆ యువకుడు నవ్వుతూ "అలా ఎందుకు చెబుతానండీ! బడలికతో ఉన్నారు విశ్రాంతి తీసుకుంటున్నారు అని చెప్పాను." అన్నాడు

ఆ మాటకు స్వామి నవ్వుతూ ఇలా అన్నారు: మా మాష్టరు గారు చిలుకూరి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు అప్పుడప్పుడు సరదాగా అంటూండేవారు. "పిల్లలు తింటుంటే చిరుతిండి అంటాం. అదే పెద్దలు తింటుంటే ఫలహారం చేస్తున్నారు అంటారు. పిల్లలు పడుకుంటే నిద్ర పోతున్నారు అంటాం. అదే పెద్దలు నిద్రపోతుంటే విశ్రాంతి తీసుకుంటున్నారు అంటాం" ఇలా వివరిస్తూ చూడు స్వామీ
పెద్దలు తమ విషయం దగ్గర కొచ్చేసరికి ఎలా సమర్థించేసుకుంటున్నారో అంటూ నవ్వేవారు. ఇప్పుడు నీవు చెప్పిన జవాబు వినేసరికి ఆ పెద్దాయన ాటలు గుర్తొచ్చాయి! సరే ఈ పెద్దాయన వస్తారేమో! లేచి తొందరగా ములుతాను! అంటూ స్వామి పైకి లేచారు.

## చరమ సందేశం

స్వామి ఒక యువకుణ్ణి పట్టుకొని గట్టిగా మందలించారు. మందలించి చివరకతన్నడిగారు: ఇప్పటికెన్నిసార్లు చెప్పాన్నానీకు అని.

అతను మాట్లాడ లేదు.

"ఏం చెప్పవేం?" స్వామి గద్దించారు.

"చాలాసార్లు చెప్పారండి."

"మరి ఎందుకని వినలేదు."

"ఈసారి వింటానండి."

"ఇపుడే చెబుతున్నాను విను. ఇదే నీకు చివరి సారిగా చెప్పడం. ఈ చరమ సందేశాన్ని కూడా వినిపించుకోకపోయావో నీకిక ఇవ్వబడేది చర్మసందేశమే. అంతదాకా మాత్రం తెచ్చుకోకు. తెచ్చుకుంటే మాత్రం ఇవ్వడం ఖాయం ఇక వెళ్లు" అంటూ అతణ్ణి పంపించివేశారు.

వ్యక్తమవుతున్న అంత కోపంలో కూడా ఆ పెదవుల మధ్య చిరునవ్వు ఒకింత రేఖగా మెరుస్తోంది.

## ఇంకెవరికీ చెప్పొద్దు

తానేమో ఎవరికీ చెప్పొద్దు అన్నాడు. సరేకదా అని నేనెవరికీ చెప్పలేదు. మళ్ళీ తనే అందరికీ చెప్పేస్తున్నాడు. మళ్ళీ వాళ్ళందరూ వచ్చి నీకు తెలుసా అని నాకు చెబుతున్నారు. ఇంకెవరికీ చెప్పొద్దని నాకు చెప్పడం ఎందుకూ? మళ్ళీ తానే అందరికీ చెప్పడం ఎందుకు? అసలు దీనికేమయినా అర్థముందా?" అన్నాడొకాయన నిట్టూరుస్తూ.

స్వామి ఇలా అన్నారు: అర్థముంది. ఇంకెవరికీ చెప్పొద్దూ అంటే, నీవుగా శ్రమపడి ఇంకెవరికీ చెప్పొద్దూ ఆ శ్రమేదో నేనే పడతాను పడదల్చుకున్నాను అని అర్థం భలే వారే అర్థం లేదంటారేమిటి?

ఇప్పుడు మీరు చెప్పినదాన్ని బట్టి చూస్తే అర్థం చాలానే ఉన్నట్లుంది. మీరు సరదాగా అన్నా అతడు అక్షరాలా అదే చేశాడు.

అయినా మీలాంటివారు సరదాగా చెప్పినా లోకంలో జరిగేది చెబుతారు గాని, జరగనివి చెప్పరు కదా! నా కర్ధమయ్యేటట్టు చెప్పారు అనుమానం నివృత్తి అయింది మీ దయవల్ల అంటూ అతడు నవ్వుతూ శలవు తీసుకున్నాడు.

## కోయదొర

బస్టాండులో నిల్చుంటే కోయదొర ఒకడు తగిలాడండీ ఎలాగో కాసేపు వెయిట్ చేయాలికదండీ అతనివైపు చూశానండీ నిన్ను చూస్తుంటే నాకు ఏదో చెప్పబుద్దవుతోంది. అంటూ ఏవేవో చెప్పాడండి" అన్నాడా యువకుడు.

"ఏం చెప్పబుద్ధయిందయ్యా వాడికి నిన్ను చూస్తే" అడిగారు స్వామి. "నేనేమో రసికుణ్ణనండి జీవితంలో చాలా అనుభవిస్తావన్నాడండి. ఒక పట్టాన తృప్తి పడవన్నాడండి. నీకు నరదృష్టి తగిలిందన్నాడండి. ఇంకేమేమో చెప్పాడండి చెప్పాడు కదా అని రెండు రూపాయలిచ్చానండి. ఊరికే చెప్పించుకోకూడదు కదండీ మరి ఇంతలో బస్సొచ్చేసిందండీ. నాతో పాటు వాడు కూడా ఎక్కాడండి."

"ఎక్కాంతర్వాత ఇంకేం చెప్పలేదు కదా!" అడిగారు స్వామి.

"చెప్పేవాడేమోనండి నేను రెండు రూపాయలు ఇచ్చేశాను కదండి అందుకని ఇంక చెప్ప ఉండడండి" అన్నాడను.

"ఇదిగో ఏమోయ్! ఆ కోయదొరలుగా కనబడే వాళ్ళల్లో నూటికి తొంబయితొమ్మిది మంది కోయు దొరలే జాగ్రత్తగా ఉండాలిసుమా అలా మాటల్లో పెట్టి నీ చేత ఎంత పెట్టించాలి అనుకుంటే అంతా బయట పెట్టించగలరు వాళ్లు" అన్నారు స్వామి.

"అందుకనే కదండీ! రెండ్రూపాయలిచ్చిన తరువాత ఇంక నేను మాట్లాడలేదండి. విషయం మీకు చెప్పేశాను కదండి. చెప్పినందువల్ల మేలు జరిగిందండి" అన్నాడతను.

"ఏమిటయ్యా ఆ మేలు?" అడిగారు స్వామి.

"నేను చెప్పానో లేదో మీరు వెంటనే వేసేశారు కదండి. కోయ దొరలు అనగానే కోయదొరలు అన్నారండి మీరు. నిజాన్ని అందంగా చెప్పారండి మీరు నిజంగా. ఇంకెప్పుడన్నా ఎదురు పడ్డారనుకోండి, ఓ మాట గుర్తొస్తుంది కదండి. నా రెండు రూపాయలు ఇచ్చాను కదండి." అన్నాడతను.

"పావుందయ్యా! ఈ చినుకులవల్ల కొన్ని లాభాలు కూడా ఉన్నాయన్నమాట. కానియ్. కానియ్" అన్నారు స్వామి.

"కొన్ని లాభాలు ఏమిటండీ! అన్నీ లాభాలే నండీ! ఇప్పుడు మీరు వేశారా అండి. నాకు లాభమండి. రేపెప్పుడో పుస్తకంలో వస్తుందాండి. అప్పుడు అందరికీ లాభమండి. ఇట్లా వేసిన ప్రతి చినుకువల్లా అందరికీ లాభమండి. అయితే ఇక్కడొక స్పెషాలిటీ ఉందండి. అందంగా మాట్లాడుతూ, ఆనందాన్నందిస్తూ మీరీ లాభాన్ని కలుగజేస్తున్నారండీ. ఇది నా అనుభవమండి!" అంటూ మురిసిపోయాడతడు.

## ఇంటర్నేషనల్

"మనం ఏది ఊహించినా, ఏం ఆలోచించినా అంతా ఇంటర్నేషనల్‌గా ఉండాల్. ఏమంటావు? ఇదివరకెటికీ ఇప్పటికీ ఎన్ని మార్పులొచ్చాయి. ఇప్పుడీ ఆధునిక యుగంలో దేశాలు దగ్గరైపోయాయి. మనం ముక్కు మూసుకుని కూర్చుంటే లాభం లేదు. వెనకబడిపోతాం. ఇంట

"నా మనస్సులో ఉన్న అనుభూతికి అక్షరరూపం ఇచ్చారు. మాస్టారూ! ఈసారి మా నాన్న అడగాలేగాని అక్షరాలా ఇదే చెబుతాను" అన్నాడా యువకుడు పరవశిస్తూ.

## నెప్ట్యూన్

చూశారా ఇంతవరకు మనమెలాంటి అనుభూతిని చెందామో! కృష్ణస్వామిగారు మాట్లాడటం మొదలుపెడితే అంతే! ఇక మనకి మనం గుర్తుండం. ఈయన పైన నెప్ట్యూన్ అనే గ్రహం యొక్క ప్రభావం అమోఘంగా వుంది. అందువల్లనే ఈయన వాక్కుకు అంతటి సమ్మోహన శక్తి నెప్ట్యూన్ అంటే ఏమిటో, వాక్కు మీద అతడు ఎలా పనిచేయగలడో ఈయన్ని చూసి మనం తెలుసుకోవచ్చు." అంటూ స్వామిని గూర్చి హృదయపూర్వకంగా మెచ్చుకుంటున్నారు శ్రీ జి. యల్. యన్ శాస్త్రి.

అంతలోనే స్వామి వారితో శ్రుతి కలుపుతూ "నెప్ట్యూన్" అంటే ఎదుటివారికి నెప్పి కలుగకుండా కావలసిన తీరులో వారిని ట్యూన్ చేయ కలగడం! నెప్పి పెట్టకుండా ట్యూన్ చేయగలుగుతోంది కాబట్టి అది నెప్ట్యూన్ అయింది." అన్నారు.

అదిగో చూశారా! ఇలా నేను చెబుతున్నానో లేదో, అలా అతని నుండి నెప్ట్యూన్ ఎలా పలుకుతోందో. అదీ! కృష్ణస్వామిగారి సంగతి." అంటూ మరింత మెచ్చుకున్నారు శాస్త్రిగారు.

తెనాలికి దగ్గరలో వున్న వలివేరు గ్రామంలో జరిగిన సమావేశం లోని సరససల్లాపాలు ఇవన్నీ ఇక అచటకు చేరిన బృందమంతా బృందా వనంలో విహరించారని వేరుగా చెప్పనక్కరలేదు కదా!

# యాస్పెక్ట్ లేదంటే

"ఇది అబ్బాయి చార్ట్. ఇది అమ్మాయి చార్ట్. వీళ్ళిద్దరికీ జాతకాలు కుదిరితే పెళ్ళి చేద్దామని అబ్బాయి తాలూకు పెద్దల ఉద్దేశం. ఇందాకటి నుండి చూస్తున్నాను. ఈ రెండు చార్ట్‌ల మధ్య సరైన ఆస్పెక్ట్ ఒక్కటీ కనిపించడం లేదు. ఎలా మరి!" అని G.L N. శాస్త్రిగారు తోటివారితో అంటుండగా స్వామి ఆ గదిలోనికి ప్రవేశించారు.

ప్రవేశిస్తూనే "యాస్పెక్ట్ లేదంటున్నారు కదా! ఇక వాళ్ళకు వ్రాసిపెట్టిలేదని చెప్పేయండి!" అన్నారు.

G.L.N. శాస్త్రిగారు పెద్దగా నవ్వేశారు. వెంటనే చార్టులు మడచి ఇక చూడవలసిన పని లేదన్నట్లుగా చూస్తూ ప్రక్కవారి కందించేశారు. ఆ అందుకుంటున్న అతను ఇందాకటినుండి మనం చూస్తున్నాం. కృష్ణస్వామిగారు విషయాన్ని సింపుల్‌గా తేల్చేశారండీ! అంటూ మురిసిపోయాడు.

గుంటూరులో E. K మాస్టరుగారి గ్రంథాలపైన 'జ్ఞానయజ్ఞమనే మహాసదస్సు ఒకటి జరిగింది. ఆ సదస్సు జరిగినన్నాళ్ళు స్వామి అక్కడే బసచేశారు. అప్పుడు నడచిన సన్నివేశాల్లో ఈ సన్నివేశం ఒకటి.

# నీ రాశి ఏదైనా

"మాష్టరుగారూ! అందరిలాగ చార్ట్ వేయించి, మీ చేత చూపించుకుందామంటే మా పెద్ద వాళ్ళు చాలా అన్యాయం చేసేశారండీ! నే పుట్టిందెప్పుడో వ్రాసి పెట్టలేదు వాళ్ళు. కనీసం స్పష్టంగా చెప్పను కూడా చెప్పలేకపోతున్నారు. ఆ కారణాన జాతక చక్రం మాట అటుంచి నాదే రాశి అన్నది కూడా నాకు తెలియటంలేదు. ఎట్లామరి? అందరూ చూపిం

చేసుకుంటూ ఉంటే, అయ్యో! మనం ఈ అవకాశం కోల్పోయామే!"
అంటూ నిట్టూర్చబోయాడో యువకుడు.

ఆ నిట్టూర్పులను ఆపేస్తూ స్వామి ఇలా అన్నారు : నిరాశ నీ దగ్గరకు చేరనంతవరకూ నీరాశి ఏదైనా వచ్చిన ఇబ్బంది ఏమీలేదు. కనుక నిట్టూర్చవలసిన పనిలేదు అంటూ అతని వెన్ను తట్టి మరో కార్యక్రమం లోనికి ప్రవేశించారు.

## గురువుని మించిన శిష్యులు

"వీడు చూడండి మాష్టారూ! అన్నీ మీ మాటలే. మీ చేతలే అన్ని విధాలా మిమ్మల్నే అనుకరిస్తున్నాడు. మాటల నిండా ప్రాసలు. నేనేదయినా కాస్త తప్పు చేస్తే చాలు ఉపదేశాలు. వీడు మనవాడేనా, మ మన్నానా? అని అనుమానం వచ్చేట్లు చేస్తున్నాడండీ! చూస్తుంటే ఇలా కొనసాగితే వీడు మిమ్మల్నే మించిపోతాడేమో ననిపిస్తోంది." అన్నదామె.

స్వామి నవ్వుతూ "గురువును ముంచిన శిష్యుడైతే సంతోషమే గురువును ముంచిన శిష్యుడైతేనే ప్రమాదం. ఏరా! ఈ రెండింటిలో ఏం తావ్?" అంటూ ఆ కుర్రవాడికి చక్కిలిగింతలు పెట్టారు.

" మించడం మాట ఎలా ఉన్నా, ముంచడం మాత్రం చేయనండీ!" అన్నాడతడు ఆ గిలిగింతలకు నవ్వుతూనే.

"ఇదిగో చూశారా! మీ తోనే ఎలా అంటున్నాడో!" అన్నదా తల్లి పరవశిస్తూ.

## పంక్చ్యూయాలిటీ

ఒక్కడూ చెప్పిన టైంకు రాడు. ఇంక పనులెట్లా అవుతాయ్? ఈ వస్తానన్న వాళ్ళ కోసం ఎదురు చూస్తూ కూర్చోవడమే ఒక పనిగా తయారవుతోంది. ఆ ఎదురు చూసే పనిలో నాకు అలసట వచ్చేస్తోంది. మన భారతీయులకి పంక్చ్యూయాలిటీ అనేది ఇంక ఏ జన్మకు వస్తుందో!" అంటూ నిట్టూరుస్తున్నారొకాయన.

ఆ నిట్టూర్పును అందుకుంటూ స్వామి ఇలా అన్నారు : పంక్చ్యూయాలిటీ అంటున్నారేమిటి? మీరింకా పూర్వపు రోజుల్లోనే ఉన్నారు. ఇపుడు మన వాళ్ళల్లో చాలా మంది అసలు పని చేయాలేమిటి అని అడుగుతున్నారు. చేయకుండా డబ్బు సంపాదించే మార్గమేమిటి అని చూస్తున్నారు. కనుక పంక్చ్యూయాలిటీ అని మనమంటే, పని చేయాలేంటి? అని వాళ్ళడుగుతున్నారు. ఈ మార్పును గుర్తించి ఇక మార్గమేమిటో చూడండి.

నిజమే మీరన్నది. పని చేయడం తగ్గిపోయింది. తగ్గిపోవడం ఏమిటి, తగ్గించేశారు. నిజమే మీరన్నది." అంటూ ఆలోచనలో పడ్డారాయన.

## రాత్రుల్ తప్పెన్

ఆంధ్రా యూనివర్సిటీలో చదువుతున్న రోజులు. నాగార్జున హాస్టల్లో రాత్రి పూట కూర్చొని అదే పనిగా వ్రాస్తున్నారు స్వామి. సీనియర్ స్టూడెంట్స్ నుండి తీసుకున్న నోట్సు ఓపిగ్గా కాపీ చేస్తున్నారు. అర్ధరాత్రి దాటినా ఆ లైట్ వెలుగుతూనే ఉంది. మిత్రుడొకడు లోపలికి ప్రవేశించాడు.

"ఇంకా వ్రాస్తున్నారా?" అన్నాడు.

"ఏం చేయను మరి! "ప్రాణంబులా తావుల్ త ప్పెన్... పాఠం బులా తావుల్ నిండెన్!" అన్నట్లున్నది నాపని." అన్నారు స్వామి నవ్వుతూ.

"అలసటలో కూడా ప్రాసలేనా?" అన్నాడతను.

"అసలట ఉన్నవవే కదా!" అన్నారు స్వామి.

"వస్తున్న నిద్ర ఎగిరిపోయింది మీ ప్రాసలతో" అంటూ మురిసి పోతూ ముందుకు సాగాడతను.

## గో లా

విశాఖలో జగదాంబా సెంటరులో ఒక ప్రక్కగా నిలబడి ఉన్నారు స్వామి తమ బృందంతో. ఆ ఎదురుగా సందులో పెద్ద గలాభా జరుగుతోంది. అదేదో తగాదా. అంతలో తెగేదికాదు. జనం మాత్రం చుట్టు మూగారు.

"ఏమిట్రా ఆగోలా?" అన్నారు స్వామి.

"ఏమిటా" అన్నట్లు చూస్తున్నారు సోదరబృందంలోనివారు అటూ ఇటూ.

చూస్తున్న వారి భుజాలపైన తట్టి ఇలా అన్నారు స్వామి. "గోల" అంటే ఏమిటో తెలుసునా! "గోలా" "go law" అంటే అక్కడ చట్టానికి చోటు లేదు. ధర్మానికి అచ్చట నిలిచే అవకాశమే లేదు. ఈ అంశాలను దృష్టిలో పెట్టుకొని ఇలాంటి సన్నివేశాలకు గోల అనే పేరు వచ్చి ఉంటుంది.

ఈ మాటలు ఆగుంపుకు కూడా వినబడ్డాయా అన్నట్లుగా అక్కడ సందడి కొంచెం సద్దుమణిగింది.

## ఏదో ఒకలా

అమాయక సోదరుడొకడు కోర్టుకేసులో ఇరికించబడ్డాడు. వచ్చి స్వామి పాదాలపై బడ్డాడు

ఒకానొక లాయరు మిత్రుడిని పిలిపించారు స్వామి. ఆ అమాయక చక్రవర్తి నాయనకు అప్పగించారు. "మీరు ఇతని విషయంలో ఏదో ఒకలా చూడాలి. ఇతణ్ణి గట్టెక్కించాలి." అన్నారు.

ఆ అమాయక సోదరుడు లాయరుగారిని చూస్తూ" చూశారా; చూశారా! ఇలాంటి సందర్భంలో కూడా మా మాష్టరుగారు ఎలాంటి చెణుకు వేశారో! ఏదో ఒక లా చూడమన్నారు. అంటే ఏమిటి ఏదో విధంగా ఇతడు బయట పడేట్టు చూడమని మామూలు అర్థం. ఏదో ఒకలా (Law) అంటె ఇతడికి పనికి వచ్చే చట్టాన్ని చూసి ఇతణ్ణి రక్షించమని మరొక అర్థం. చూశారా...చూశారా...మా మాష్టరుగారు ఎలాంటి చెణుకు వేశారో!" అన్నాడు.

చెణుకును ఇంత చక్కగా విప్పి చెప్పినవాడు కోర్టు కేసులో ఎలా ఇరికించబడ్డాడు అమాయకంగా అని చూస్తూనే. ఆ చెణుకులోని స్వారస్యానికి ఆ లాయరుగారు ఆశ్చర్య పడుతున్నాడు.

స్వామి ఆ అమాయకుణ్ణి భుజం తట్టి "నేను వేసే ప్రాసలను గమనించడమే కాదోయ్, కాస్త లోకంపోకడలను కూడా గమనించడం నేర్చుకో. వాడికెవడికో అక్కడ పిలక అందించి ఇక్కడకు వచ్చి నడ్డి ఆడిస్తే ఎలా చెప్పు" అంటూ ఇద్దరినీ సాగనంపారు.

## లావొక్కింతయు

"లోక మంతా గందరగోళంగా ఉంది. పద్ధతీలేదూ పాడూలేదు. ఎవర్ని నమ్మాలో తెలియదు. ఎవరిని నమ్మ కూడదో తెలియదు. నమ్మించి నట్టేట ముంచేవాళ్ళే ఎక్కువమంది. అయిన వాళ్ళనీ లేదు. కాని వాళ్ళనీ లేదు. ముంచే విషయంలో అందరూ ఒక్కటిగానే ఉన్నారు" అని వెష్టపడుతున్నాడు మిత్రుడు. ఇంత వెష్టపడుతున్నా మీరేమీ కల్పించు కోరేం అన్నట్లుగా చూస్తున్నాడు స్వామివైపు.

ఆ చూపు నందుకొని స్వామి ఇలా అన్నారు. "లా వొక్కింతయు లేదు. ధైర్యంబు విలోలంబయ్యె" అన్నట్లున్నది మనపని. అంటావు అంతేనా!

విషాదంలో నుండి తేరుకుంటూనే బావుందిగాని మరి కాస్త వివరిస్తే ఇంకా బావుంటుంది అన్నట్లుగా చూశాడతడు.

అదిగమనించిన స్వామి ఇలా అన్నారు. లావు ఒక్కింతయు లేదు అన్నది అనాటి గజేంద్రుని మాట. అక్కడ "లావు" అంటె బలం. బలం సన్నగిల్లిపోతోంది. ఇకనీవు కలుగ జేసుకోక తప్పదూ అంటున్నాడతడు దైవాన్ని ఉద్దేశించి. "లా" (Law) ఒక్కింతయు లేదు అన్నది ఈనాటి మన మొర, ధర్మం, చట్టం ఇవెక్కడా కానరావ డం లేదు. ఇక కాచుకో వలసిన వాడివి నీవే! అన్నది మన ప్రార్థన. ఆనాటి ప్రార్థనను విన్నట్లే ఈనాటి ప్రార్థనను కూడా ఆయన వినిపించు కుంటే తప్ప ఈ లోకానికి మోక్షంరాదు. ఈ ఉన్న స్థితి నుండి.

మిత్రుడికి సంతోషమైంది. అతని మనస్సు ఆ మాటలనే స్మరించుకుంటూ ఉండిపోయింది.

## ఏ మ ం డీ ?

"ఈమధ్య ఆయన మొండితనం మరీ ఎక్కువైపోతోంది ప్రతి చిన్న విషయంలోనూ మొండికేస్తున్నారు. ఎంత చెప్పినా అర్థం చేసుకోరు. ఆయనకు ఎంతతోస్తే అంత. సంసారమెలా చేయాలో బోధపడటంలేదు. దారికి రాకపోతారా అని చూస్తూ కాలక్షేపం చేస్తున్నాను. కానీ చూస్తున్నకొద్దీ మొండితనం పెరుగుతోందిగాని తరుగుతున్న జాడలేమి కన్పించటం లేదు" అంటూ చెప్పుకు వస్తున్నదొకామె.

సావధానంగా వింటున్న స్వామి అక్కడితో ఆమెను ఆపుతూ ఇలా అన్నారు. ఒకపని చేయ్. ఇప్పటినుండీ ఆయన్ని ఏమండీ అని పిలిచే బదులు ఏమొండీ అని పిలువు. అప్పుడాయన దారిలో కొస్తాడు.

"మీరు మరీను మాష్టారూ ఎవరైనా అలా పిలుస్తారేమిటి? అయినా నేనిదండీ సమస్య అని చెబుతుంటే మీరలా ఆటపట్టించి నవ్విస్తారేమిటి?" అన్నదామె.

"ఏం? నవ్వుతూ నవ్విస్తూ సమస్యలు తీర్చుకూడదా! సమస్యలు తీరాలి అంటే సీరియస్‌గానే ఉండాలేమిటి? ఒక చిత్రం చెబుతాను చూడు. మనం సీరియస్‌గా చూస్తున్నకొద్దీ సమస్యలు మరీ పెద్దవవుతాయి. మనం నవ్వుతూ టాకిల్ చేస్తే అవే దారిలోకొస్తాయి. టాకిల్ చేయడానికి గాను కావలసిన నైపుణ్యాన్ని మనకందించ గలిగింది మన చిరునవ్వేసుమా!" అన్నారు స్వామి.

నవ్వులోని శక్తి క్రమంగా ఆమెకు బోధపడుతున్నట్లు కనిపించింది.

## మల్లె మొగ్గలు

"ఒరేయ్ బాబు! అటు వెళ్ళకు-వెళ్ళకు. దేవుడు. అక్కడగెంతకు. ఇటొచ్చేయ్!" అంటూ చిన్న బిడ్డని మాటి మాటికి ఇవతలికి లాక్కొ వస్తోంది తల్లి. మళ్ళీ మళ్ళీ అక్కడికే వెళ్ళిపోతున్నాడు వాడు. అక్కడే ఆడటంలో వాడికేదో ఆనందమున్నట్లుంది. ఆ ఫోటోల వైపు చూస్తూ రకరకాల విన్యాసాలు చేస్తున్నాడు. ఆ తల్లి మళ్ళీ లాక్కొచ్చే ప్రయత్నం చేస్తున్నది.

ఆ దృశ్యాన్ని గమనిస్తున్న స్వామి "వాణ్ణి వదిలేయ్! వాడేం పాడు చేయడం లే. అక్కడే ఆడుకుందామనే సరదాలో ఉన్నాడు వాడు. మీరందరూ దేవుడి పాదాల దగ్గర మల్లెమొగ్గలు వేసి నమస్కరిస్తుంటే వాడాయన సన్నిధిలో పిల్లిమొగ్గలు వేసి ఆయన్ని సంతోషపెడుతున్నాడు. మీ మల్లెమొగ్గలు మీరు ఇంకొక చోటునుండి తెచ్చినవి ఈ పిల్లిమొగ్గలు ఇవి వాడి సొంతం. ఇంకొక దానితో అర్చించడానికి, తననే అర్పించు కోవడానికి చాలా తేడా ఉంది. అందుకని వాణ్ణి వదిలేయ్" అన్నారు.

ఆమె ఇక ప్రయత్నించలేదు. ఆమె ఇప్పుడు స్వామి మాటలలోని అర్థాన్ని గ్రహించడానికే ప్రయత్నిస్తోంది.

## పాదనమస్కారం

"బాబూ! నీకే చెప్పేది. దేవుడి వైపు అలా పాదాలు పెట్టకు. నీ పాదాలు దేవుడికి తగలగలవు. తప్పు. ఇటొచ్చేసెయ్ పాదాలు తగిలితే పాపం వచ్చేస్తుంది దేవుడికి కోపమొచ్చేస్తుంది" అంటూ బిడ్డను మంద లిస్తున్న తల్లివైపు చూస్తూ స్వామి ఇలా అన్నారు. భలేదానివే నీవు. పాపం, కోపం అంటూ మనకున్న లక్షణాలన్నీ దేవుడి కంటగడుతున్నా వేమిటి! చిన్నపిల్లలకి దేవుడిని గూర్చి పరిచయం చేయవలసిన విధాన

మిదేనా? అయినా వాడేం చేశాడుగనుక. మీరందరూ పాదనమస్కారం చేస్తున్నారు. వాడూ పాదనమస్కారం చేస్తున్నాడు. మీరు పాదాలకు నమస్కారం చేస్తున్నారు. వాడు పాదాలతో నమస్కారం చేస్తున్నాడు. విభక్తిలోనే తేడా. భక్తిలో కాదు. ఆమాటకొస్తే వాడిదే నిజమైన భక్తేమో!

## కాలందడం లేదు

స్వామి ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్లున్నారు. ఇంతలో సోదర బృందంలోని ఒకామె వచ్చింది. ఆమె అవసరాన్ని బట్టి తగు మాత్రంగా మాట్లాడి ఆమెను తృప్తి పరచి మళ్ళీ తమ ఆలోచనలోనికి వెళ్ళారు స్వామి. స్వామి స్థితిని పసిగట్టింది. కానీ అడిగేందుకు ఆమెకు ధైర్యం చాలలేదు.

వెళ్ళేముందు స్వామి పాదాలకు నమస్కరించ డానికని ఆమె ముందుకు వంగింది. మంచం మీద కూర్చుని పాదాలను అలాలోపలికి పెట్టుకొని ఉన్నారుస్వామి. నమస్కరించడానికి ప్రయత్నిస్తూ "మాష్టరు గారూ కాలందడం లేదు" అన్నది.

ఆమెకు కాళ్ళందేట్లుగా పెట్టి ఆమె కన్నులలోనికి చూస్తూ "అప్పను కాలందడం లేదు" అన్నారు స్వామి.

ఆమె ఆశ్చర్యంతో కూడిన ఆవేదనతో స్వామివైపు చూసింది. వివరాలు తెలియకపోవచ్చు. పరిస్థితి ఆమెకు బోధపడుతోంది. స్వామి ఏదో తీవ్రమైన యోచనలో ఉన్నారు. అయినప్పటికీ ఆ యోచనలో నుండే యోచనకు తగ్గట్టుగానే సరసమాడుతున్నారు. దణ్ణం పెట్టడానికి మీకాలు అందడం లేదు అనిసేనంటే, అప్పను కాలందడం లేదు అని తానున్న స్థితికూడా ఆ మాటలలోనుండే సూచించారు. ఇలా సూచించ గలగడానికి ఎంతటి సమయస్ఫూర్తి ఉండాలి, ఎంతటి సంపుయమనం

ఉండాలి. ఇంతకు ఆయన యోచన దేనిని గురించి? మనందరికీ సమస్యలొస్తే ఆయనను చెప్పుకుంటాం. మన అందరి సమస్యలూ కలిపి ఆయన కర్తవ్యంగా రూపు ధరిస్తున్నాయి. ఇందులో దేనికో కావలసిన పరిష్కారం గురించి ఆయన తదేక దృష్టితో యోచిస్తున్నారు. "నిత్యతృప్తో నిరాశ్రయః" అన్న శ్లోక భాగం కన్నులకు కడుతోంది. అని అనుకుంటూ ఆమె నెమ్మదిగా సెలవు తీసుకున్నది.

## పీలును బట్టి

"రండి! రండి! ఇవాళ రోటరీ మీటింగ్ ఏమయినా ఉన్నదేమిటి? అకస్మాత్తుగా ఊడిపడ్డారు" అంటూ స్వామి స్వాగతం పలికారు. ఆ వచ్చినవాళ్ళు స్వామి వదినగారు, తోడల్లుడు.

"ఇవాళ రోటరీ ఇన్నర్‌వీల్ మీటింగ్ ఉంది మాకు. త్యాగరాయ కళాక్షేత్రంలో. అందరూ హోటల్లో దిగారు. మేము హోటల్లో లగేజి పడేసి ఇలా వచ్చాము." అంటూ కాసేపు ముచ్చటలాడారు వాళ్ళు.

ఇక మాకు టైమయిపోతుంది. కథ మీకు తెలిసిందేకదా! మేం వెళ్ళొస్తాం అంటూ లేచారు వాళ్లు.

"కానీయండి! ఇలాగే పీలును బట్టి అప్పుడప్పుడూ వస్తూ ఉండండి!" అన్నారు స్వామి చిరునవ్వులు చిందిస్తూ.

ఇందులోని చెణుకు ఏమిటి అని ఆశ్చర్యంగా చూస్తున్నవారికి ఒక్క క్షణంలో మెరుపు మెరిసినట్లయింది "ఓ! బలే చెణుకు వేశారే మా ఇన్నర్‌వీల్ మీద. నవ్వుతూ అన్నా మీరన్నది నిజమే. మరి మేము వస్తున్నది ఆ 'పీలు'ను బట్టే కదా!" అంటూ వాళ్ళు సెలవు తీసుకున్నారు.

## చిరాకు

ఈ మధ్య ఏమిటో ఒకటే చిరాకు. వద్దన్నా వచ్చేస్తోంది. ఏం చేయాలో తెలియడంలేదు. దాని సంగతి చూడవలసిన మీరేమో ఇక్కడున్న కాసేపు నవ్వించి పంపిస్తున్నారు. మరి అక్కడున్న వాళ్ళంతా బలైపోతున్నారు కదా! వాళ్ళ సంగతేమిటి పాపం!" అన్నది ఒకామె.

"ఇంత బుద్ధిగా విశ్లేషిస్తూ వివరిస్తున్నావు, వస్తూన్న కోపాన్ని గురించి. మరి అది ఇంకెలా వస్తున్నది. నువ్వొక పనిచేయ్. చిరాకు వస్తున్నపుడల్లా ఛీ! రాకు! అని చెప్పు. అలా చిరాకు మీదే చిరాకు పడ్డావనుకో ఇక అది రాదు. ఏమంటావ్!" అన్నారు స్వామి.

"నేనిప్పుడే చెప్పాను కదా! మీరిలా నవ్వించి పంపిస్తారని" అన్నదామె.

"ఇది నవ్వించి పంపడం కాదు. నవ్వటం నేర్పడం. నవ్వటం నేర్చుకుంటే చిరాకులు కూడా సరససల్లాపాలుగా మారిపోతాయి. కొంచెం అభ్యాసం చేయి." అన్నారు స్వామి.

"అందరికీ మీలా సాధ్యమవుతుందేమిటి?" అన్నదామె.

"అలా సాధ్యం చేయడానికే నేనున్నది. నువ్వు సిద్ధం కావాలేగాని తప్పక సాధ్యమవుతుంది" అంటూ ఆశీర్వదించి పంపేశారు స్వామి.

## పరాకు

"ఇప్పటిదాకా ఇక్కడ కూర్చుని వెళ్ళినవారు ఎవరో తెలుసటయ్యా నీకు." అడిగారు స్వామి. ప్రక్కగదిలోనుండి తమ గదిలోనికి అడుగు పెడుతున్న యువకుణ్ణి.

"ఎవరో నేను పట్టించుకోలేదండీ!" అన్నాడతను.

"అదేమిటయ్యా! అంత సేపయింది వాళ్ళొచ్చి. ఇంత సేపటినుండి కబుర్లు చెబుతున్నారు. నువ్వసలు వాళ్ళను పట్టించుకోనేలేదా?" అడిగారు స్వామి.

"ఏమిటోనండీ! పరాకుగా వుండిపోయాను!" అన్నాడతను.

"ఏమి పరాకయ్యా బాబూ! నీ పరాకుకు మా బహూపరా అంటూ నవ్వుకున్నారు స్వామి.

అతను అప్పటికి కూడా పూర్తిగా ఈ లో లేడు. రూపు కట్టుకున్న పరాకువలె కనిపిస్తున్నా

"ఈ మధ్య వస్తున్న సినిమాలు పెద్ద లేదండీ ఏ పిక్చర్లోనూ సత్తా కూడా పెద్దగా క వాళ్ళలో ఎక్కువమంది ఆ పాతవాళ్ళ కొడుకులే కొట్టుకుపోతున్నారు. ఒక రకంగా చెప్పాలంటే ఇప్పుడు సినిమాల్లో నడుస్తున్నది వారసత్వపు యుగం. ఇక మనం చేయవలసిందల్లా వారు చేసింది చూడటమే. దానిని యాక్షన్ అనుకోవడమే!" అంటూ బాధను వ్యక్తం చేశారొకాయన.

వారి మాటలకు స్పందిస్తూ స్వామి ఇలా అన్నారు. ఇప్పటి ఈ కుర్ర హీరోలకు ఆ పాతవాళ్ళనుండి వారసత్వమయితే వచ్చింది గాని వారసత్వం మాత్రం రాలేదు. పెళ్ళిళ్ళలో తోడు పెళ్ళికొడుకులుండరూ అలా ఉన్నారు వీరిలో ఎక్కువమంది. తోడి పెళ్ళికొడుకులు ఎలా పెళ్ళి కొడుకులు కారో వీళ్లూ అలాగే హీరోలు కారు. ఏదో కొన్నాళ్ళపాటు కాలం ఇలా వెళ్ళబుచ్చుతారు.

బాగా చెప్పారు. మీరన్నట్లుగా వారసత్వం అయితే వచ్చింది కాని వారి సత్త్వం వీరికేది? ఆనాడు వాళ్ళు చేశారు అంటే ఆ లెక్క వేరు. ఆ కృషి వేరు. ఆ కృషి వీళ్ళల్లో ఎక్కడిది? ఆనాటి నటన ఒక తపస్సు. ఈనాడు వీళ్ళకొక కాలక్షేపం. పలుకుబడి పెట్టుబడి. అనే రెండు బడులతో కాలక్షేపం చేస్తున్నారు." అంటూ ఆ ప్రస్తావనను ముగించారు ఆ పచ్చినాయన.

## అరవిందు

ఈ మధ్య అరవిందమహర్షికి సంబంధించిన గ్రంథమొకటి చదువుతున్నాను మాష్టారూ. కాకపోతే అది తెలుగు అనువాదమనుకోండి. కొంత బోధపడి, కొంత బోధ పడకుండా ఉన్నది. నేననుకున్నంత ఇదిగా లేదు. అంత తృప్తి కలగడం లేదు. మరి నాలోనే లోపముందో. ఆ గ్రంథానువాదమే అలా ఉందో, నాకు బోధపడలేదు." అన్నాడొక యువకుడు.

స్వామి ఇలా అన్నారు. అరవిందుని రచనలే గంభీరమైనవి. మామూలుగా అనువాదం చేసినప్పుడే ఒక భాషలోని సౌందర్యం వేరొక భాషలోనికి రావడం కొంచెం కష్టం. అందులోను అరవిందునివి లోతైన దివ్యదర్శనం నుండి వ్యక్తమైనవి. ఆ రచనలు ఎంత సుందరమైనవో, అంత ప్రౌఢమైనవి కూడా. అయితే సమర్పణభావంతో ఆయనతో ప్రతి కుసుమస్పర్శ కలిగితే వజ్రాలవంటి ఆ రచనలు కుసుమాలై మనలను స్పృశించగలవు. దానికాయన అనుగ్రహం పరిపూర్ణంగా పొందినవాడై ఉండాలి ఆ అనువాదకుడు. ఏది ఏమైనా అరవిందుని గ్రంథాలు అనువదించిన వారిలో చాలామంది తెలుగువారికి అరవిందుని గూర్చి 'అరవిందే' చేయగలిగారు గాని పూర్తి విందు చేయలేకపోయారు. కనుక

ఈ అనువాదాలను దాటి అసలు గ్రంథాలకు చేరుకోవడమే మనము చేయవలసిన పని. ఆ పని చేయ్।

తప్పకుండా। మీనుండి ఆ ఆజ్ఞ వచ్చింది అంటే అది ఆ అరవిందులఆజ్ఞే. ఇవాల్టినుండే ఆ మూలగ్రంథాల అధ్యయనం నేను మొదలు పెడతాను మాష్టారు" అంటూ తృప్తిగా చూశాడతడు స్వామివైపు.

## ధర్మకాటా

"మహాత్మాగాంధి వైశ్యుల కుటుంబంలో జన్మించినవాడు కదా। కాని చిత్రం. ఆయనలో ఎక్కడా అసలు ఆవైశ్యసంబంధమైన లక్షణాలే కన్పించవు కదండీ। అన్నాడొక యువకుడు.

చిరునవ్వు నవ్వుతూ స్వామి ఇలా అన్నారు. నీవన్నది కొంత వరకే నిజం. ఆయనలో లోకరీతిలో మనకు కనబడే వైశ్యుల లక్షణాలేమీ లేవు. కాని ఆ వైశ్యధర్మం యొక్క పరమార్థం ఆయన జీవితంలో కని పిస్తుంది. ఎందుకనంటే ఆయన జీవితాంతం ధర్మాధర్మాలను తూస్తూనే ఉన్నాడు. ఏది ఎంతవరకు ధర్మం ఏది ఎంతవరకు అధర్మం అని తూచి తూచి అడుగువేసేవాడు కనుక ఆయన చేతిలో కనబడని ధర్మకాటా ఒకటి ఉండేదన్నమాట మాత్రం సత్యం. ఈ విధంగా ఆయన పుట్టుకతో తనకు సంక్రమించిన ధర్మాన్ని కూడ లోకహితాన్ని సాధించగల దివ్య జీవనానికి అనుగుణంగా మలచుకున్నాడు.

ఆ యువకుడు ఆశ్చర్యంతో మునిగి తేలుతున్నాడు స్వామి ఇచ్చిన వివరణకతడు ఆశ్చర్యచకితుడైపోయాడు. ఎంత సూక్ష్మదృష్టి మాష్టారూ। మీది. నేనిలా అన్నానో లేదో వెంటనే అది యిది అని అక్కడున్న పరమార్థాన్ని వివరంగా అందించారు. మీరన్నది నిజమేనండీ ఆయనలో పరమార్థాన్ని సాధించగల వైశ్యధర్మమున్నది." అంటూ ఆనందించా డతడు.

## ఇది ఏ కాఫీ

"మాష్టరుగారు! కాఫీ తీసుకోండి" అంటూ స్వామిచేతికి కాఫీ అందించింది ఒక అమ్మాయి.

అందుకుంటూ స్వామి అన్నారు "ఇంతకూ ఇది వెజిటేరియన్ కాఫీనా, నాన్ వెజిటేరియన్ కాఫీనా?"

ఆ అమ్మాయి ఆశ్చర్యంగా చూస్తోంది. కాఫీలోకూడా వెజిటేరియన్, నాన్ వెజిటేరియన్ ఉంటాయా అని.

స్వామి ఇలా అన్నారు. "ఆశ్చర్యపడకు. వెజిటేరియన్ కాఫీ అంటే మామూలుగా ఉన్న సాదాకాఫీ అన్నమాట. నాన్ వెజిటేరియను, అంటే జంతు జాలముతో కూడుకొని ఉన్నదన్నమాట జంతువుల్లో కూడా చీమలకు ఈ విషయంలో ఎక్కువ స్థానం ఉంది. కాఫీలో రెండు మూడు చీమలు తేలుతున్నాయనుకో, అది నాన్ వెజిటేరియను కాఫీకాక మరేమవుతుంది?"

ఆశ్చర్యానికి బదులు ఆ అమ్మాయికి సిగ్గుముంచుకొచ్చింది. పంచదార డబ్బాను జాగ్రత్తగా పెట్టుకోలేని తాను ఇప్పటికి ఎన్నిసార్లు నాన్ వెజిటేరియన్ కాఫీని ఇచ్చివుంటానోనని.

## నుస కాఫీ

మాష్టరుగారు! కొంచెం కాఫీ త్రాగుతారా? అన్నాడొక యువకుడు.

"ఒరేయ్! అదిసరేగాని బ్యాగ్ అదీ ట్రైన్లోపల సరిగ్గా మన బెర్త్ మీదే పెట్టివచ్చావా, ఇంకెక్కడైనా వదిలివచ్చావా ఈ పారవశ్యంలోపడి" అన్నారుస్వామి. ఆ యువకుడిని ఆపప్తిస్తూ.

"పెట్టవలసిన చోటే పెట్టివచ్చాను. ప్రక్కవారికి చెప్పివచ్చాను కూడా"

"ఏమని?"

"చూస్తూఉండమని."

"ఇది కోణార్క. ఇప్పుడర్ధరాత్రి. ఆ ప్రక్కవాడలాచూస్తూ ఉండలడంటావా?"

"మీరు మరీను మాష్టారు వాళ్ళకు చిన్నపిల్లలు కూడా ఉన్నారు. ట్రైన్ కదిలేదాకా వాళ్ళెవరూ నిద్రపోరండీ. అదిసరేగని ఓ.కాఫీ సంగతి" మరొకసారి గుర్తు చేశాడు.

"నన్నిలా వదిలి పెట్టవా ఏమిటి?"

"అర్ధరాత్రికదా! బద్ధకంగా ఉంటుందని."

"బద్ధకంగా ఉంటే మటుకు."

"కొంచెంకాఫీ తాగితే ......"

"బద్ధకంతో పాటు వికారం కూడా వస్తుంది. ఓ పని చేద్దామనుకుంటున్నాను. నేనెప్పుడయినా కాఫీ మానేద్దామనుకున్నప్పుడు చివరిసారిగా ఈ రైల్వేస్టేషనులో కాఫీతాగుతాను. అప్పుడిక కాఫీ త్రాగాలనిపించదు. దీనినలా దోహదకారిగా వాడుకుందాం అవసరమొచ్చినపుడు. ఇప్పటికి వదిలేయ్!"

"మీరు మరీను మాష్టారు. ఇది నెస్‌కాఫీఅండీ!"

"ఒరేయ్! ఇది నెస్ కాఫీకాదురా! నుసకాఫీ. నుస అంటే ఏమిటో తెలుసునా? దురద. ఈ కాఫీ త్రాగటంవల్ల "ఫెచ్చింగ్" ఏమీ లేకపోయినా గొంతులో "ఇచ్చింగ్" మాత్రం మిగిలిపోతుంది. అదిగో చూడు. మన ఇచ్చింగ్ అనేటప్పటికి వాడు సిగ్నల్ ఇచ్చేశాడు. ఇంక వస్తాను.

నీవుకూడా ఈ కాఫీ విషయంలో కక్కుర్తి పడకుండా ఇంటికి చేరు."
అన్నారు స్వామి రైలు ఎక్కుతూ.

"అలాగే మాస్టారూ! మీరింతగా వర్ణించిన తరువాత ఇప్పుడే కాదండి, ఇలాంటిచోట మరింకెప్పుడూ త్రాగలేను" అంటూ మనసారా నవ్వుకుంటూ స్వామికి వీడ్కోలు చెబుతున్నాడా యువకుడు.

స్వామి బద్ధకం మాట ఎలా ఉన్నా యువకుడిబద్ధకం మాత్రం కాఫీతో పనిలేకుండానే వదలిపోయింది.

## స్టవ్ అంటే చిరాకు

ఎన్నడూ ఇంటిలో పని అంతగా చేయని ఒకామె స్వామి తమ ఇంటికి వచ్చారు కదాయని స్వయంగా కాఫీ పెడుతూ ఇలాఅన్నది: "నాకీ స్టవ్ అంటే చిరాకు ఇలా పాలుపెట్టి అలా బయటికెడితే ఇంతలోనే పొంగి పోతాయి." అంటూ కాఫీకలిపి తెచ్చి స్వామికిచ్చింది. అలవాటులేని పని కదా పాపం. అందులో ఆమె కాఫీ త్రాగదు. ఆ కలిపిన కాఫీ ఎలా ఉంటుందో అని భయం. సామ్వికి స్వయంగా కలిపి ఇవ్వాలని కోరిక.

ఒకవైపు ఆనందం. ఒకవైపు భయం. స్వామికి కాఫీ ఇవ్వగలిగాను కదా అని ఆనందం. ఈ కలిపిన కాఫీ ఆయన త్రాగేట్లుగా ఉంటుందో ఉండదో అని భయం. ఆ భయానందాలు కళ్ళలో తొణికిసలాడుతూ ఉండగా స్వామికి కాఫీ అందించిందామె.

కాఫీ అందుకుంటూ బాగానే ఉంటుందిలే భయపడకు అన్నట్లుగా చూస్తూ స్వామి ఇలా అన్నారు. "ఏమిటి? స్టవ్ అంటే చిరాకా? అయితే స్టవ్ అంటించిరాకు.

అక్కడున్న అందరూ నవ్వారు.

అర్థమయిందా అన్నట్లుగా చూశారామెవైపు స్వామి.

"ఆ! అర్థమైంది. మీరు నన్ను ఆట పట్టిస్తున్నారు." అంది ఆమె మెలికలు తిరుగుతూ.

ఏమిటి అర్థమయింది? అన్నట్లు చూశారు స్వామి.

"నా మాటలు మీరు విన్నారు. ఆ మాటలకు బదులు చెప్పారు. ఇలా బయటకు వెళితే అలా పాలు పొంగిపోతాయి. అందుకే ఈ స్టవ్ అంటే ఓరాకు అన్నాననేను. అయితే నువ్వు స్టవ్ అంటించిరాకు అని బదులు చెప్పారు. స్టవ్ అంటించి ఇవతలికిరాకు.ఆ పని మీదే ఉండుఅని. మీ మాటలకు అలవాటు పడ్డదాన్ని. ఆ మాత్రం అర్థం కాకుండా ఉంటుందా? అన్నదామె.

"అర్థమవడమే కాదు దానర్థం అమలులోకి కూడారావాలి" అన్నారు స్వామి.

"అమలులోకి రావడానికేగా మేమెక్కడ మరచిపోతామోనని మీరు ప్రాసల్లోకి ఇమిడ్చి మరీ చెప్తారు. ఇకమేం మరచి పోదామన్నా సాధ్యమా. మీ ప్రాసలు మమ్మల్ని విడిచి పెడతాయా? స్టవ్ అంటించి నప్పుడల్లా స్టవ్ అంటే ఓరాకు అన్న నా మాట అయితే స్టవ్ అంటించిరాకు అన్న మీమాటా ఈ చెవులకు వినబడుతూనే ఉంటాయి మీ మాటల్లో ఉన్న గమ్మత్తేఅది. ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే మీరందంగా తిట్టగలరు అని.

"తిట్టినా మేమందంగా" అన్నారు స్వామి.

అందరూ మళ్ళీ నవ్వుకున్నారు.

## ప్రాపర్టీ

క్రొత్తగా తాను కట్టిన ఇంటిని నలువైపులా చూపించి, నడుమ హాలు లోనికి తీసుకొని వచ్చి, స్వామి అక్కడ ఉన్న సోఫాలో కూర్చుంటూ ఉండగా స్వామికీ ప్రక్కనున్న సోదర బృందానికీ వాళ్ళమ్మాయి తీసుకుని వచ్చిన టీ కప్పులను అందిస్తూ..." ఇదీ మాష్టరు గారూ! ఇంతవరకూ చేయగలిగాను. ఈ రూపానికి వచ్చింది. ఏదో ఉద్యోగం మీద బ్రతికే వాళ్ళం ఇతర ప్రాపర్టీలా ఏమీలేవు. ఏదో ఈ ఇల్లు మాత్రం కట్టగలిగాం. తరవాత మన పిల్లలేమనుకున్నా సరే" అన్నాడా సోదరుడు.

ఇతర ప్రాపర్టీలూ అవీ లేవనే బాధ ఎందుకయ్యా? ఏదో ఈ మాత్రం ప్రాపర్టీని ఏర్పాటు చేశావ్. వచ్చినవాళ్ళకు చక్కగా ప్రాపర్ టీ ని అందిస్తున్నావు. ఇది చాలదూ! "లెస్ లగేజ్ మోర్ కంఫర్ట్." అవసరాలకు సరిపడా ఉంటే చాలు. ఏమంటావ్!" అన్నారు స్వామి చిలిపిగా చూస్తూ.

ఆసోదరుడు ఆమాటలకు నవ్వుకుంటూనే తృప్తి పడిపోయాడు.

## ఉపద్రవం

"ఏమిటి మరి, ఈ టిఫిన్ పెట్టిన వారు కాఫీ కూడా ఇస్తారని అనుకుంటున్నాను. ఇంతకూ ఇస్తున్నారా? లేదా?" అడిగారు స్వామి.

"ఇవాళ ఎందుకనో పాలింకారాలేదు. రావలసిన వేళేమరి, ఒక్కొక్క రోజున ఇలాగే ఆలస్యం చేస్తూఉంటారు పాళ్ళు. టైంకి వస్తాయన్న ఉద్దేశంతో టిఫిన్ చేసేశాను, మరి అది వాళ్ళచేతిలోపనాయె.

మీకేమో ఒక్క నిముషం కూడా లేట్ కాకూడదు" అన్నారు కల్యాణి గారు.

"బలే పనిచేశారే! ద్రవంలేకుండా చేసి ఉపద్రావాన్ని సృష్టించేశారే! ఇక మీరెంత ఘనంగా టిఫిన్ పెట్టినా ఏం లాభం చెప్పండి! ద్రవం లేని ఘనం రాణిస్తుందా?" అన్నారు స్వామి.

"అనుకుంటూనే ఉన్నాను మీరిలా అంటారని ఎంత జాగ్రత్తగా చేస్తూ వచ్చినా ఇంత సందు దొరికితే చాలు మీరు యాగీ చేసేస్తారు". అన్నారు ఆవిడ.

"యాగీ చెయ్యడం కాదిది. ఆటపట్టించడం." అన్నారు స్వామి.

"మీకలాగే ఉంటుంది. ఇవతలదానికి గురయ్యే వాళ్ళకి తెలుస్తుంది. అన్నారావిడ.

"ఇదిగో చూశావా! ఇదే ఉపద్రవమంటే. ఇదంతా ఆ ద్రవం లేక పోవడం వల్ల వచ్చిందే కదా!" అని స్వామి అంటూ ఉండగానే పాలు వచ్చేశాయి.

"హమ్మయ్యా! పాలొచ్చేశాయ్! వచ్చేసేలోపల ఈ రెండు నిముషాలలోను ఎంత హడావిడి చేశారో" అంటూ కాఫిని కలిపే ప్రయత్నంలో నిమగ్నమయ్యారావిడ.

## ఓన్ హౌస్

"మీ దయవల్ల ఈ మధ్యనే ఇల్లు ఒకటి ఏర్పాటు చేసుకోగలిగాం హౌసంటూ ఏర్పడితే అదొక తృప్తికదా!" అన్నాడొకతను.

"హౌస్ ఏర్పాటయిందంటావ్! బావుంది ఇంతకూ అది లోన్ హౌసా...ఓన్‌హౌసా?" అడిగారు స్వామి చిరు నవ్వుతో.

అతనికి నవ్వొచ్చింది. "ఈ రోజుల్లో ఉద్యోగులు ఎవరు కట్టినా మీరన్నట్లుగా లోన్ హౌసులే మాస్టారు. ఓన్ హౌస్‌లు కట్టుకోగల్గినవారు చాలా తక్కువనే చెప్పాలి." అన్నాడతను.

"బావుందయ్యా! ఓన్‌హౌసన్న పదానికి లోన్‌హౌస్ అనే అర్థాన్ని వచ్చేటట్లుగా చేశారు మీలాంటి ఉద్యోగస్థులంతా కలిసి ఏది ఏమయితేనేమి. ఈ మహానగరంలో ఇల్లొకటి ఏర్పాటు చేసుకోగలిగావ్. చాలాసంతోషం". అంటూ ఆశీర్వదించాడు స్వామి.

## అప్ స్టైర్స్

"రిటైరయింతర్వాత కొంత మొత్తమొచ్చింది. దానికి తోడు కొంత అప్పుచేశాం. ఈ అంతస్తు వేశాం. క్రింద అద్దెకిచ్చాం పైన మేముంటున్నాం. ఇదీ కథ" అన్నారా దంపతులు తమ ఇంటిని స్వామికి చూపిస్తూ.

"అయితే దీనికి అప్ స్టైర్స్ అన్న పేరునిజమయిందన్నమాట." అన్నారు స్వామి.

కొద్ది క్షణాల తర్వాత దంపతులలో ఒకరికి మెరుపు మెరిసినట్లైంది. "బలే చెప్పారే మాకింతకాలం తట్టనే లేదు. అయితే మేం ఎవరికి చెబుతున్నా నిజమే చెబుతున్నా మన్నమాట అప్పుచేసి వేశాము ఈ "అప్ స్టేర్స్" అని అంటూ మరల మరల నవ్వుకున్నారు. ఇక మేం ఎవరికి చెబుతున్నా అప్‌స్టేర్స్ అని చెప్పుతున్నప్పుడల్లా దీని అప్పుకూడా గుర్తుకొస్తుంది దాన్ని తీర్చే ప్రయత్నం కూడా తీవ్రం చేస్తాం బావుందండీ మీ చెణుకు" అని ముసుకున్నారు మళ్ళీ.

## ఫ్యాన్ ఫ్యాన్ కోసమే

"ఏమిటి మాష్టారు పైకి చూస్తున్నారు?" అడిగాడు యువకుడు.

"ఫ్యాన్‌ను చూస్తున్నాను" అన్నారు స్వామి.

"ఏం మాష్టారూ?"

"అసలది తిరుగుతోందా అని!

"తిరుగుతోంది గదండీ! కాకపోతే గాలిమాత్రం అంతగా రావటం లేదండీ"

"మరింకెందుకు తిరగడం? ఇదేదో ఫ్యాన్ ఫ్యాన్ కోసమే అన్నట్లుగా ఉంది."

అతడు నవ్వుతూనే ఆశ్చర్యంగా చూశాడు.

అది గమనించిన స్వామి ఇలా వివరించారు: కళ కళకోసమే అన్నట్లు ఇక్కడ ఫ్యాను ఫ్యాను కోసమే అన్నట్లుగా ఉంది. ఏమంటావ్ ప్రయోజనాన్ని సాధించని కళ, గాలిని అందించలేని ఈ ఫ్యాను ఒక లాంటివే అని అనిపించి అలా అన్నాను. ఫ్యాను తిరుగుతోంది కాని గాలి మనకు రాదు చిత్రంగా ఉంది కదూ! దాని పని చేస్తోంది. మన పని మాత్రం జరగటం లేదు ఏదీ! మామూలు విసన కర్ర ఒకటుంటే అందుకో, అన్నట్లు అసలు ఫ్యాన్ అంటే విసనకర్ర అనే అర్థంకదూ! అసలర్థం అదేనని దానినే ఆశ్రయించమనీ ఈ ఫ్యాన్ ఇప్పుడు మనకు గుర్తు చేస్తోంది.

యువకునికి ఆశ్చర్యం తొలిగింది. అతడు విసనకర్రను వెతికే ప్రయత్నంలో నిమగ్నమయ్యాడు.

## లాసన్స్ బే

"నేనొకటడుగుతాను చెప్పండి. విశాఖపట్నంలో ఇన్ని ప్రాంతా లుండగా మీరీ లాసన్స్‌బేను ఎంచుకొని మరీ ఉండటానికి కారణమేమిటి? మీరన్నింటికీ సరసంగా జవాబు చెబుతారు కదా! దీనికేమి చెబుతారో వినాలని అడుగుతున్నాను." అన్నాడొక యువకుడు.

నవ్వుతూ ఇలా అన్నారు స్వామి: న్యూసెన్స్ పెరిగిపోతున్న ఈ సమాజంలో "లా సెన్స్"ను పెంచాలన్న ఉద్దేశంతో ఈ లాసెన్స్ బేను ఎంచుకున్నాను.

ఆ యువకుడు "బలే! చెప్పారండీ! ఇలా అడగంగానే అలా... ఎలా వచ్చేస్తాయో అలా" అంటూ ఆ పదాలను మరల మరల స్మరించు కుంటూ మురిసి పోయాడు.

## కాలనీ

"మా కాలనీ ఉందన్న మాటేగాని ఎవరికి ఎవరూ పట్టరనుకోండి. కష్టానికయినా అంతే! సుఖానికయినా అంతే! అక్కడున్నా ఒక్కటే, అడవిలో ఉన్నా ఒకటే అన్నట్లుగా ఉంది. ఎవడికి ఎవడు పట్టడూ. అదేమి కాలనీ అండీ బాబు!" అన్నదామె.

సావధానంగా వింటున్న స్వామి ఇలా అన్నారు : ఎవరి చావు వాళ్ళు చస్తారన్నట్లు, ఎవడి మానాన వాడు "కాలనీ" అనుకుంటున్నా రేమో మీ కాలనీ వాళ్ళంతా. నీవు చెబుతున్న అంశాలని బట్టి చూస్తే ఒక సజీవ ప్రాంతంగా కాక సమాధుల ప్రాంగణంగా గోచరిస్తోంది మీ కాలనీ. మనిషికి మనిషి కనబడకుండా ఆస్తులు, అంతస్థులు, హోదాలు, పదవులు కనబడుతున్నప్పుడు, అవి అడ్డొస్తున్నప్పుడు, ఇక ఒకరికొకరు

దగ్గరెలా అవుతారు. బాగుంది మీ కథ. మీ కథ అని ఏమిటిలే! ఇప్పుడు ఎటువైపుకు చూసినా ఈ తెగలు కనబడుతూనే ఉంది. ఈ తెగులు సోకని ప్రాంతాలు చాలా కొద్ది. బస్తీల్లో అయితే అంతస్థులూ, హోదాలూ, పల్లెల్లో అయితే పార్టీలూ.. వర్గాలు. ఏమయితేనేం. ఫలితం ఒక్కటే. ప్రతి ఒకడూ మరి ఒకడిని పరాయి వాడిగా చూస్తూ ఎవడి మానాన వాడు వంటరి తనమనే నరకాన్ని అనుభవిస్తున్నాడు. మనమను కుంటున్న విలువలన్నింటికన్నా విలువైనటువంటి వాడు తోటి మనిషే నన్న సత్యం మన కన్నులకు పొడగట్టేంత వరకూ ఈ కథ ఇంతే!" అంటూ స్వామి తన గదిలోనికి వెళ్ళిపోయారు.

## గ ర ల్

"చూడండి మాష్టారూ వీడు. ఆడపిల్ల అంటే చాలు మండి పడు తున్నాడు. ఇక పెళ్ళంటె చెప్పనే అక్కరలేదు. నాకేమో వయస్సు ముదరకుండానే వీడికి పెళ్ళి చేయాలని. వీడేమో అసలా ప్రసక్తే వద్దని. మీరైనా చెప్పండి మాష్టారు. అలాంటి భావం వీడికుండటం అదేమైనా మంచిదా చెప్పండి?" అన్నదొక నడివయస్కురాలు. ప్రక్కనే కూర్చున్న ఆమె కొడుకు తల వంచుకొని మరీ కూర్చున్నాడు.

"ఏమోయ్!" పిలిచారు స్వామి.

అతడు తలపైకెత్తాడు గాని స్వామి వైపు సూటిగా చూడలేక పోతున్నాడు.

"పెళ్ళంటే నీ కిష్టం లేదా!" అడిగారు స్వామి.

అతనికేం చెప్పాలో పాలు పోవడం లేదు.

"గరల్ అంటే నీకు గరళంగా గోచరిస్తోందా?" ఆట పట్టిస్తు న్నట్లుగా అడిగారు స్వామి.

అతడికి నవ్వొచ్చింది.

ఆ ప్రక్కనే కూర్చున్న అతని తల్లి హమ్మయ్య! అన్నట్లుగా తృప్తిగా ఊపిరి పీల్చుకుంది.

ఇకపైన అతడు వివాహం చేసుకున్నాడని వేరుగా చెప్పనక్కర లేదనుకుంటాను.

## ఛీ - ఛీ

మా వాడి పరిస్థితి నాకేమీ అర్థం కావటం లేదు మాష్టారూ! పెళ్లి ప్రసక్తి తెచ్చినప్పుడల్లా ఛీ! ఇప్పుడెందుకని వెళ్లిపోతాడు. ఇలా ఎప్పటి కప్పుడు ఇప్పుడెందుకు, ఇప్పుడెందుకు అనుకుంటే ఎలా చెప్పండి. ఆ ఏటికా యేడు వస్తోంది కదా! ఏమైనా చిన్న పిల్లాడా! అంటూ తనలోని వేదనంతా స్వామి సన్నిధిలో వెళ్ళబోసుకున్నది ఒకామె.

చిరునవ్వు నవ్వుతూ స్వామి ఇలా అన్నారు : మీ కుర్రవాడి భాష నీకు బోధ పడింది కాదు. ఇప్పుడెందుకు? అంటే ఇప్పటి దాకా ఆగావెందుకు? అని అర్థం. యువకుల భాషను అర్థం చేసుకోవడానికి మనం కూడా యువకులం కావాలి కాసేపు. ఇక్కడ పిల్లవాడు ఛీ అంటూ ఉంటాడు. అక్కడ పిల్ల ఛీ అంటూ ఉంటుంది. వాళ్ళు అలా అంటూ ఉండగానే చి-చి॥ సా అని శుభలేఖ వేసేయాలి. ఇంకేముంది పెళ్లైపోతుంది. ఆ తరువాత పుట్టిన పిల్లవాణ్ణి చూస్తూ ఇద్దరూ కలిసీ ఛీ! ఛీ అని నవ్విస్తూ ఉంటారు.

ఆమెకు నవ్వొచ్చింది.

స్వామి మళ్ళీ ఇలా అన్నారు : బోధపడింది కదా! ఇక మీదే లేటు. సరయిన సంబంధం చూడండి. అంటూ ఆమెను సాగనంపారు.

## ఎక్సర్ సైజ్

డిస్పెన్సరీ చకచకా సాగుతోంది. అంతవేగంలోనూ నడివయస్కు డైన స్థూలకాయ డొకాయన మందు వ్రాయించుకొన్న తరవాత కూడా కొంచెం అ ప్రక్కగా జరిగి అలాగే నిలబడ్డాడు. ఏమిటన్నట్లు చూశారు స్వామి. "ఈ మధ్య డైలీ ఎక్సర్ సైజ్ చేస్తున్నాను. దానివలన ప్రయోజన మంటుందంటారా? ఉంటే ఒకవేళ ఎలాంటి ప్రయోజన ముంటుంది" అని అడిగాడతను.

"ఎక్సర్ సైజ్ చేయడం మంచిదే. దానివల్ల ఈ ఎక్స్ట్రా సైజు తగ్గుతుంది. అంతకంటె మీకు కావలసిన ప్రయోజనం మాత్రం ఇంకే ముంది" అన్నారు స్వామి.

అతనికి నవ్వొచ్చింది. సిగ్గు కూడా వేసింది కదలలేను అంటున్న దేహాన్ని కదిలించుకుంటూ ముందుకు సాగాడు.

## మెడలు నొప్పులు

"రాత్రిళ్లు ఎక్కువ సేపు చదవలేక పోతున్నాను మాష్టరుగారూ! ఈ మెడలున్నాయి చూశారు ఒకటే నెప్పులు. ఈ మెడను నిలబెట్టడం చాలా కష్టంగా ఉంది. కాస్త గట్టెక్కే మార్గం చూపించాలి మీరు!" అని అడిగాడు ఒకయువకుడు.

"బాగుందయ్యా! నీవేదో చదివి పరీక్షల్లో ర్యాంకు తెచ్చుకొని మెడలు సంపాదిస్తావనే ఆశతో ఉన్నారు మీవాళ్ళు. ఆమెడల్ మాట ఎలా ఉన్నా ముందు ఈ మెడల నెప్పులు సంపాదించ గలిగావు నువ్వు!" అన్నారు స్వామి.

మీరు మరీను మాష్టారు. మరీ ఆటపట్టించేస్తున్నారు" అన్నాడతను.

"లేకపోతే ఏమిటయ్యా! ఈ మాత్రం కష్టపడ్డందుకే మెదలలా పట్టేస్తే ఎలా? వళ్ళు వంచి పని చేయడాన్ని అలవాటు చేసుకోవాలి. అది గనుక నీకీ వయసులో అభ్యాసం కాకపోయిందో, ఇక పెద్దయిన కొద్దీ నీ కసలు ఒళ్ళు వంగదు. నీవు చెప్పిందానికి మందేమిటో తెలుసా. నెప్పుల్ని లెక్కచేయకుండా చదువుకుంటూ పోవడమే అప్పుడు మనని గుర్తించడం మాదేశాడురా! అని వదిలిపెట్టి వెళ్ళి పోతాయ్. ఏమైనా వర్తిల్లేది గుర్తించి నంతవరకే. పద-పద ఆగదిలో ఉన్నతను నీకొక డోస్ మందు ఇస్తాడు తీసుకో. అసలు డోస్ నేనిచ్చినదేనని గుర్తించుకో! ఒడలు వంచు, మెదలు వంచు. అనుకున్న మెదలు సాధించు!"

నీరసంగా వచ్చిన కుర్రవాడిని ఆ ఆటపట్టించడంతోనే మెడ పట్టడం తగ్గినట్లుంది. చాలా ఉల్లాసంగా లేచి వెళ్ళాడు.

## తగ్గు ముఖం

"ఎలా ఉంది ఒంట్లో?" ఎదురుగా ఉన్న యువకుణ్ణి ప్రశ్నించారు స్వామి.

"అన్నీ తగ్గిపోయాయండీ! కాని, ఒక్క దగ్గు మాత్రం వస్తోందండీ!" అన్నాడతను.

"అయితే కేసు "తగ్గు ముఖం" పట్టేందుకు బదులుగా "దగ్గు ముఖం" పట్టిందన్నమాట" అన్నారు స్వామి.

"అవునండీ దగ్గు ముఖమే పట్టింది" అన్నాడు నవ్వుతూ.

## ప్రమథ గణాలు

"ఈ పూట డిస్పెన్సరీ చక్కగా జరిగిపోయింది." అన్నారు స్వామి.

"ఎప్పటికన్నా ఇవాళరష్ ఎక్కువగా ఉంది. అయినా ప్రమథ గణాల్లా మన వాళ్ళందరూ ఉన్నారుగా! అందుకని శ్రమ తెలియలేదు" అన్నాడొక యువకుడు.

"ప్రమథ గణాల్లా సహకరిస్తే ఫరవాలేదు. ప్రమాదగణాలుగా మారితేనే ప్రమాదం" అన్నారు స్వామి చిరునవ్వు నవ్వుతూ.

మా మీద మీకా నమ్మకం లేదా మాష్టరుగారూ అన్నట్లు చూశాడా యువకుడు.

నమ్మకముంది. దాన్ని నిలబెట్టుకోవలసిన బాధ్యత మీ మీదుంది. ఏ మాత్రం ఏమరుపాటు చూపించినా ప్రమథ శబ్దం ప్రమాద శబ్దంగా మారే ప్రమాద ముంది అన్నట్లుగా చూశారు స్వామి.

## తారు మారు

మందు వ్రాసిన తరువాత కూడా ఒకామె అలా స్వామి ముందు నిలబడే ఉంది. ఏమిటింకా నిలబడ్డా వన్నట్లు చూశారు స్వామి.

"మీకు తెలియందేముంది? మా వారి పరిస్థితంతా తారు మారుగా ఉంది" అందామె. ఆ కళ్ళు చెమర్చబోతున్నాయి.

చమర్చబోతున్న కళ్ళను ఆపేందుకా అన్నట్లు ఇలా అన్నారు స్వామి. "తారుమారుగా ఉన్నారంటావా? ఏం ఫరవాలేదు. ఇక మారుతారులే."

ఆమెకు నవ్వొచ్చింది. మీరిట్టే మాటలు తిప్పేస్తారు. నవ్వించేస్తారు అన్నదామె.

“మాటల్నేకాదు! మనుష్యుల్ని కూడా” అన్నారు స్వామి ఆమె కళ్ళల్లోనికి చూస్తూ.

తనను తాను సర్దుకుంటూ అన్నదామె “అందుకేగా మీకుచెప్పేది”

“చెప్పావుగా మరి, ఇక సర్దుకుంటుంది.” అంటూ ఆమెను తృప్తిగా సాగనంపారు స్వామి,

## చెప్పు కరిచింది

సన్నిహితులైన దంపతులు ముందుకని నిలబడ్డారు.

“ఏమిటి?” అన్నట్లు చూశారు స్వామి.

“చెప్పు కరిచిందండీ!” అన్నాడాయన.

“చెప్పి కరిచిందా, చెప్పకుండా కరిచిందా?” పరిహాసమాడారు స్వామి. అతనికి నవ్వొచ్చింది. “అది క్రొత్త చెప్పులండీ. నిన్ననే మా ఆవిడ కొనుక్కొని వచ్చింది!” అన్నాడు.

“మరి చెప్పరేం? అవికొని ఇచ్చేటప్పుడు ఆమె చెప్పే ఉంటుంది. “తప్పకుండా ఆ పిన్ని కరవండీ అని.”

ఆ దంపతులతో పాటు అక్కడున్న అందరూ నవ్వుల్లో తేలారు.

## తగినంత - తెగనంత

"నీ వెక్కువ మాట్లాడతావా? తక్కువ మాట్లాడుతుతావా?" అడిగారు స్వామి డిస్పెన్సరీలో ఎదురుగా కూర్చున్న యువకుణ్ణి. ఆ యువకుడు నవ్వాడు.

"నీవు క్రొత్త వారితో చొరవ చేసుకొని మాట్లాడగలవా?" మళ్ళీ అడిగారు స్వామి.

"చేసుకోగలను చేసుకొని తగినంత మాట్లాడగలను" అన్నాడా యువకుడు.

"బాగుంది క్రొత్త వారితో అయితే తగినంత మరిపాత వారితో అయితే తెగనంతా?

అందరూ నవ్వారు. ఆ యువకుడు అందరికీ పరిచయం కావడం మూలాన నవ్వులు మరికాసేపు కొనసాగాయి.

"మరీ తెగనంత కాదు మాష్టారు" అన్నాడతడు. "నీకలాగే ఉంటుంది లేవోయ్! అవతలివాడు కదా చెప్పవలసింది" అన్నారు స్వామి ఆటపట్టిస్తూ.

చుట్టూ ఉన్న సోదరులలో కొందరు మరింత నవ్వారు. ఎందుకంటే, వారలా అతనిచేత బాధింపబడిన వారు కనుక.

## వా రి కి

నమస్కరించి లేచి నిలబడుతూ ఒకామె ఇలా అన్నది. "మీరు చెప్పింది నాకు అర్థమయిందిగాని అసలు అర్థం చేసుకోవాల్సిందాయన మీకు తెలియందేముంది. మీ ఆజ్ఞను పాటించడానికి నేనెప్పుడూ సిద్ధమే. నిజానికి నాకెంతగా చెప్పవలసిన పనిలేదు. అసలు చెప్పవలసింది వారికి."

"వారి "కి" నీవేకదా! అదినీబాధ్యత."

ఆమెకు చినుకు అర్థమైంది. వస్తున్న నవ్వునాపుకుంటూ ఇలా అన్నదామె: "మీ ఆశీస్సుల వలన అలా అవ్వాలేగాని అంతకన్న కావల్సిందేముంటుంది!"

"అలా అవ్వాలనేకదా! నేనంటున్నది. నీవు సామాన్యురాల వేమిటి? నీశక్తి నీకు తెలియదు. తెలుసుకున్నరోజున నీవునిజంగా మంచి

"కీ" అవుతావు. మంచికీ పనికొస్తావ్." అంటూ చూపులతోనె ఇక వెళ్ళి రమ్మని ఆమెకు వీడ్కోలు చెప్పారు స్వామి.

## ఇం టి మ సీ

"ఐనవాడని చేరదీశాను. మొదట్లో వాడూ బాగానే ఉండేవాడు. ఎంతఇదిగా ఉండేవాడనీ! ఇప్పుడా ఇంటిమసీ అంతా ఏమైపోయిందో ఏమో! నన్నొక బద్ధ శత్రువుగా పరిగణిస్తున్నాడు. ఏమిటో ఈవైప రీత్యం!" అంటూ వాపోయాడొక సోదరుడు.

స్వామి ఇలా అన్నారు: ఇంటిమసీ ఎక్కువైతే ఇంటిమసే మిగులుతుందయ్యా చాలా సందర్భాల్లో! ఆత్మీయతను అర్థం చేసుకొని పొందిన అనురాగాన్ని చిరకాలం నిలుపుకో గలిగిన వారు చాలా కొద్దిమందే ఉంటారు. నిజం చెప్పాలంటే ఆ నిలుపుకోవడం ఒక తపస్సే సుమా!

నిజమే మాష్టారుగారూ! మీరంటున్న మాటలు, అన్నట్లుగా చూశాడతను.

స్వామి ఇంకా ఇలా అన్నారు: కాబట్టి ఎవరైనా అనురాగాన్ని అలా నిలపుకుంటే ఆనందించాలిగాని, నిలుపుకోలేకపోతే ఆశ్చర్య పడనక్కర్లేదు. బాధపడనూ అక్కరలేదు.

"నిజమే మాష్టరుగారూ. మీరన్నమాటలు నిజమే. అన్నాడతడు.

## ఆ స్తి ప రు లు

ఎంత ఆస్తిపరులైతే మాత్రం అంత అహంకారమా ? చెప్పండి మాష్టారూ! ఏమిటో లోకం మారిపోతోందండీ! ఆస్తి ముందు అంతస్తు ముందు బంధుత్వాలు పనిచేయడం లేదు. స్నేహాలు పనిచేయడంలేదు. తెలివి తేటలు, శక్తి సామర్థ్యాలు కూడా పనిచేయడంలేదు. ఏమిటో ఈ లోకంలో చెలామణి కావాలంటే ఆస్తిపరులు కాక తప్పదు అన్నట్లుంది." అంటూ తన జీవితానుభవాన్ని చెప్పసాగిందొకామె.

అంతా విని స్వామి ఇలా అన్నారు: పిచ్చిదానా! ఆస్తిపరులు అన్న మాటలోనె ఆస్తిపరులదే అన్న హెచ్చరిక ఇమిడి ఉంది. ఉన్నవాడైనా

లేనివాడైనా తినేది ఆ గుప్పెడు మెతుకులే. మిగిలింది బుద్ధిమంతుడైతే తానుండగా ఇస్తాడు. బుద్ధిలేకపోతే ఆ తరువాత పంచుకుంటారు. ఎవరు? మట్టితోటుండే పరులు. అయితే నీవన్న మాటలో ఒకవిధమైన నిజమున్నది. అదేమిటంటే ఇదివరకటి కన్న ఇప్పుడు ప్రజలు ధనానికి ఎలువ ఇస్తున్నారు. అదేముఖ్యమన్నట్లు చూస్తున్నారు. అదిలేనివారిముఖం చూడటమంటే చాలా హేళనగా ఉంటోంది వాళ్ళకి. అలాగే లేనివాడు కూడ ధనానికే విలువ నిస్తున్నాడు. నాదగ్గర ధనం లేదుకదా। లేదుకదా అని పదిసార్లు అనుకుంటున్నాడు. మరొకలా తనలోఉన్న శక్తియుక్తులు చూసి అతడు తృప్తిపడటంలేదు, వాటిని సద్వినియోగం చేసేపనికూడ అంతగా చేయడంలేదు. మిగిలినవి ఎన్నుంటే ఏంలాభం ? నాదగ్గర ధనం లేదుకదా। ధనంలేదుకాబట్టే కదా లోకం నాకువిలువ నివ్వటంలేదు" అని అనుకుంటూ అతడుకూడ ధనానికే విలువ నిస్తున్నాడు. అదీచిత్రం. ఉన్నవాళ్ళు, లేనివాళ్ళు కలిసి ధనానికి వెర్రి విలువనివ్వటమే ఇప్పటి కాలపు విచిత్రం. ఇదిఇలా ఎంతోకాలం సాగదు. ధనంవెంటపడి పిచ్చివాడవుతున్న మనిషికి త్వరలోనే నిజంగానే తనకి కావలసిందేమిటి అన్నది తెలుస్తుంది. అతడు వెనక్కి తిరిగి చూస్తాడు. ధనాన్ని ఎంతలో ఉంచాలో అంతలో ఉంచుతాడు. ధనానికి విలువ ఇవ్వడం అనేది మాని దానిని వినియోగించడం ఎలాగో నేర్చుకుంటాడు, కనుక నీవు వర్ణించిన దృశ్యాలు కొద్దికాలంలో మారిపోగలవు. స్వాతంత్ర్యానికి ముందు మనం ధనానికి ఇంత విలువనీయలేదు. ఇకపైనకూడ మనం ఇంత విలువనివ్వం. ఈ మధ్యనడుస్తున్నది ఒక విషమమైన కాలం. ఇది ఇలా ఎంతోకాలం సాగదు. కాల చక్రం తిరగడం ఆగదు. ఆ తిరగడంలో మళ్ళీ మంచి మార్పులు వస్తాయి.

ఆమె తృప్తిగా చూసింది. "మీరన్నట్లుగా నాజీవిత కాలంలో అలాంటి మంచి దృశ్యాలను చూడాలని కోరుకొంటున్నాను." అంటూ స్వామికి నమస్కరించింది.

## తాట వలుస్తున్నారు

నవ్వుతూ నవ్విస్తూనే ఎదురుగా కూర్చున్న యువకుడికి చురక లంటిస్తున్నారు స్వామి. ఆ యువకుడు నవ్వుతూనే ఉన్నాడుగానీ చురక లకు తట్టుకోలేకపోతున్నాడు. అటుగా వచ్చి సన్నివేశాన్ని గమనించిన సన్నిహితులొకరు "ఏమిటి! ఇవాళ మనవాడి తాట వలిచేస్తున్నట్లున్నారే!" అన్నారు నవ్వుతూ.

"తాట వలవడం లేదు. వాడి థాట్ వలుస్తున్నాను." అన్నారు స్వామి.

నిజమే మరి! ఆలోచనలను విడదీసి సరిచేయడమేగా ఆయన చేస్తున్నది. అవును నిజమే ఆయన "థాట్ వలుస్తున్నారు."

## శంకరా

"చేయడానికి మళ్ళీ శివధ్యానం చేస్తాడు. శంకరుడంటే అతని కిష్టంట. మళ్ళీ తెల్లారిలేస్తే అన్నీ అనుమానాలే. అతడు అనుమానించని వాడంటూ ఉండడు. భార్య దగ్గరనుండి. బిడ్డల దగ్గరనుండి, బంధు మిత్రాదుల దగ్గిరనుండి అందరిపైనా అనుమానమే. ఒక మాటలో చెప్పా లంటే అనుమానమే ఇలా రూపు ధరించిందా అని అనుమానం వస్తూ ఉంటుంది. మరింకెందుకో శివభక్తి, శంకరుడు నాకిష్టదైవమని చెప్పు కోవడం ఎందుకో? అంటూ వివరిస్తున్నారు ఎదురుగా కూర్చున్నాయన, ఒకానొక వ్యక్తిని గూర్చి.

వివరణ పూర్తి చేసి కొంత మౌనంలోనికి వచ్చిన తర్వాత స్వామి ఇలా అన్నారు. బహుశా అతను ధ్యానంలో కూర్చున్నప్పుడల్లా శంకరా! శంకరా, అని ధ్యానించేబదులు శంకారా! శంకారా! అని ప్రార్థిస్తున్నాడేమో! ఆ ప్రార్థన ఫలించి శంకలు ముమ్మరంగా అతన్ని వరిస్తూ ఉండగా నిత్య శంకితుడుగా రూపొందుతున్నాడేమో! చేసుకున్నవాడికి చేసుకున్నంత

మహాదేవా! అన్నట్లు ధ్యానించిన వాడికి ధ్యానించినంత, ఏమంటారు? దేనిని ధ్యానిస్తున్నాడో దానిని పొందుతున్నాడు. అతడు పొందుతున్న దాన్ని బట్టి అతని ధ్యానమేదో ఇట్టే చెప్పవచ్చు. అదేమంత కష్టం కాదు. ఎవరి విషయంలోనైనా అంతే. వారు ధ్యానిస్తున్నదేదో అది వారి జీవితంలో ప్రతిఫలిస్తూనే ఉంటుంది. దేనిని ధ్యానిస్తారు అనేది వారి సంస్కారాన్ని బట్టి ఉంటుంది తప్ప ఎదురుగా ఉన్న ఫొటోలను బట్టి, ఉపదేశం పొందాననుకుంటున్న మంత్రాలను బట్టి ఉండదు.

ఆ ఎదుటి వ్యక్తికి సంకోచం కరిగిపోయింది. అవతలి వ్యక్తి యొక్క ధ్యాన స్వరూపం బోధపడింది కదా! ఆయన తృప్తిగా నవ్వుతున్నారు. "ఎటువంటి విషయాన్నైనా ఇట్టే తేల్చిపారేయడం అది మీ ప్రత్యేకత మాష్టరుగారూ! మీ వాక్కు ప్రభు సమ్మితం. దానికి తిరుగు లేదు. మీ సరసం సార్ధకం. దానికి ఎదురులేదు!" అంటూ పరవశించాడు.

## ఎమికబుల్

మొదట్లో ఎంత ఇదిగా ఉండేవాడు మాష్టారు! చాలా ఎమికబుల్‌గా ఉండేవాడండి. అలా చూస్తూ ఉండగానే మార్పు వచ్చేసింది. ఇవాళ అతనికి ఎవ్వరూ ఆనటం లేదు. వీడెంత? వాడెంత! అని ఎంతటివాడ్నైనా ఇట్టే తీసేస్తున్నాడండీ!" అన్నాడొక నడివయస్కుడు.

ఆ మాటలను అందుకుంటూ స్వామి ఇలా అన్నారు అందుకే నయ్యా ముందు చూపు ఉండాలి నాయనా అని చెబుతూ ఉంటాను. వాడేదో రోజులు గడవక మంచిగా ఉన్నాడు. ఎమికబుల్‌గా ఉన్నాడు కదా అని మీరు చేరదీశారు. ఇప్పుడు రోజులు గడుస్తున్నాయి, ఇంకేముంది వాడు "ఎముకపుల్"గా తయారయ్యాడు. ఇక ఇప్పుడేమనుకొని ఏం లాభం?

మీరన్నది నిజమేనండి. నవ్వుతూ చెప్పినా మీరు నిజమే చెబుతారండి. నిజంగానే అతడిప్పుడు ఎముకపుల్‌గానే ఉన్నాడండి. ఏమన్నా అంటే మాట దక్కదేమో అని భయమేస్తోందండి." అంటూ నిజస్థితిని వివరించాడతను.

జరిగింది చాలు. ఇప్పటికైనా ఏదో ఒక విధంగా బయటపడండి. చేతనయితే అతన్ని దూరంగా ఉంచండి." అంటూ వెన్ను తట్టి అతన్ని సాగనంపారు స్వామి.

## ఆజానుబాహుడు

"మాష్టరుగారూ ! ఆజానుబాహుడు అంటే అర్థమేమిటండీ?" అడిగాడొక యువకుడు.

"ఆజానుబాహుల ప్రసక్తి ఎందుకొచ్చిందోయ్! ఇప్పుడు పుట్టుకొస్తున్న వారిలో ఎక్కువమంది ఆజానబాహులే కదా!" అన్నారు స్వామి.

అతడు నవ్వుకుంటూనే "అది కాదు మాష్టారూ కావాలి" అన్నాడు.

"ఏం లేదు. జానువులు అంటే మోకాళ్ళు. ఆజానుబాహులు అంటే మోకాళ్ళవరకు సాగిన చేతులు గలవాళ్ళు. అంగ సాముద్రికంలో అదొక విశిష్టమైన లక్షణం. మోకాళ్ళవరకు గల చేతులు, చెవులవరకు సాగినకళ్లు ఇలాంటివి కొన్ని విశిష్టమైన లక్షణాలను మనవాళ్ళు గమనిస్తూ వచ్చారు. విశిష్టమైన లక్షణాలు అంటే ఆ లక్షణాలు కలిగి ఉండటమే ఒక విశిష్టత అని అర్థం.

ఇక ఆజాన బాహుల సంగతి నీకు వేరే చెప్పనక్కరలేదు కదా! ఇప్పటివారిలో చాలామంది ఆ కోవకు చెందినవారే కదా! ఇలా జానెడు బాహువులతో వెళ్ళదీస్తున్నవారికి ఆ ఆజానుబాహుల సంగతి ఏం తెలుస్తుంది చెప్పు" అన్నారు స్వామి.

నిజమేనన్నట్లుగా తల ఊపసాగాడతను.

## మధ్యలో

జాతీయ సాహిత్య పరిషత్ ఆధ్వర్యంలో అమలాపురంలో సభ. భారతం—ధర్మాద్వైతం పైన స్వామి ప్రసంగం.

అనుభూతి ప్రదంగా సాగిన ప్రసంగం పూర్తికాగానే స్వామి వేదిక దిగి ఇవతలికి వస్తున్నారు.

ఇంతలో దృఢకాయుడైన యువకుడు గభాలున వచ్చి ఒక్క ఉదుటున స్వామి పాదాలపై వాలాడు. "కొంచెం బ్యాడ్‌లక్ సార్. నేను వచ్చేటప్పటికి మీ ప్రవచనం ప్రారంభమయింది. మొదటినుండి లేకుండా మధ్యలో వచ్చినందుకు నాకు చాలా బాధనిపించింది సార్."

అతని భుజం తడుతూ స్వామి బలేవాడివోయ్! అలా అనుకుంటే ఎలా? అలా అయితే మనమంతా మధ్యలో వచ్చినవాళ్ళమే." అన్నారు.

ఆ యువకుడు ఆశ్చర్యంగా చూశాడు. అంతా మధ్యలో రావటమేమిటని?

స్వామి మళ్ళీ ఇలా అన్నారు. ఈ సృష్టి కథలో మనమంతా మధ్యలో వచ్చిన వాళ్ళమేగా! ఏమంటావ్! మొదటినుండీ లేమని బాధపడవచ్చునా!

"భలే చెప్పారు సార్. నా బాధంతా ఇప్పుడు మాయమైపోయింది. ఒక్క మాటతో ఇట్టే తీసేసారు మీరు." అంటూ పరవశించాడు.

## నొక్కి చెప్పాలి

సన్నిహితుడైన యువకుడొకడు లోపలికి వచ్చాడు. స్వామివైపు చూస్తూ ఏదో చెప్పబోతున్నాడు.

అతడి వైఖరిని గమనించిన స్వామి ఇలా అన్నారు. అబ్బాయ్ ఇవాళేమి చెప్పదలుచుకున్నా నొక్కి చెప్పవలసిందే. నీ ఇష్టం మరి. ఆలోచించుకో.

ఆ యువకునికి అర్థమైంది. స్వామికి ఒంట్లో బావుండలేదని. పాదాలు నొక్కుతూ కబుర్లు చెప్పడం ప్రారంభించాడు.

"నీకు నొక్కి చెప్పడం చేతనవుతోందిరా! అన్నట్లు అతడివైపు అభినందనగా చూశారు స్వామి.

## బంగారు కొండ

చెబుదామనుకున్నవన్నీ చెప్పేసిన తరువాత కూడా ఇంకా కదల లేక పోతున్నదామె.

ఇంకేమయినా ఉన్నాయా విశేషాలు? అన్నట్లు చూశారు స్వామి.

"అదే గుర్తు చేసుకుంటున్నాను. ఎన్నెన్నో చెప్పాలని వస్తాను. కొన్ని అయినా చెప్పుకోలేను. మళ్ళీ మెట్లు దిగింతరువాత గుర్తొస్తే..."

"మెట్లు దిగకు" అన్నారు స్వామి.

కొంచెంగా ఉడుకుతూ ఇలా అన్నది ఆమె. "ఆ! మీకేం మీరు చెబుతారు. చక్కగా బంగారుకొండలాగ కూర్చొని. మా కెట్లా?"

"నేను బంగారుకొండనయితే మరి నీవు బంగారుకొండవా?" అన్నారు స్వామి.

మరింతగా ఉడుకుతున్నదామె.

"ఇలా ఉడికించడమే మీ పని" అన్నది

"ఉడకడం పూర్తయ్యేవరకు మరి ఉడికించొద్దూ. ఇక పద! నీవు చెప్పినవి, నీవు చెప్పాలనుకొని మరిచిపోయినవి అన్నీ సర్దుకుంటాయిలే!" అంటూ లాలనగా చూశారు స్వామి.

"హమ్మయ్య! ఈ మాట అనిపించుకోవడానికే ఇంతసేపు ఇక్కడ వున్నది. ఇక నే వస్తా!" అంటూ నమస్కరించి సెలవు తీసు కొన్నదామె.

## మీ ఋణం ఈ జన్మకు

మొన మొన్నటివరకు నాతోపాటు ఇక్కడికి వస్తూ వుండేవాడు. అతను మీకు తెలుసు కదా! డబ్బులివ్వాలి. తీసుకొని చాలా రోజులైంది. ఎంతకూ ఇవ్వడు. ఎంతకని వేచి ఉండగలను చెప్పండి. కనబడినప్పుడల్లా మాత్రం, మీరు చేసిన సహాయం మరచిపోలేను అంటూ ఏమిటేమిటో చెప్తాడు. అతడి పరిస్థితి నాకేమీ బోధపడటం లేదు" అంటూ క్రింద కూర్చొబడ్డాడు. వయస్సు నలభైదాకా ఉంటాయ్.

ఆ మాటలు విని స్వామి ఇలా అన్నారు. ఏమంటున్నాడు మీరు చేసిన సహాయం మరచిపోలేను అంటున్నాడా! ఆ తరువాత ఇంకో వాక్యం కూడా అంటూ ఉండి ఉంటాడు. నీవు సరిగ్గా విన్నావో లేదో ఆ వాక్యం ఏమిటో తెలుసునా! "మీ మేలు మరిచిపోనండి. మీ ఋణం ఈ జన్మకు తీర్చుకోలేను" అని.

"నిజమేనండి ఆ మాట కూడ అంటూనే ఉంటాడతడు. ఏదో మాటవరుస కంటున్నాడనుకున్నాను. ఇదా వరస!" అన్నాడతను.

"మరి చెప్పవేం. అతడు స్పష్టంగా చెబుతున్నాడు. మీ ఋణం ఈ జన్మకు తీర్చుకోలేను అని. ఆ మాట విని కూడా ఇంకా అతను తీర్చటం లేదని బాధపడటంలో అర్థం ఏమిటి చెప్పు. ఇవన్నీ తెలిసే ఒకాయన చెప్పాడు. "సామాన్యంగా ఎవ్వరికీ అప్పు ఇవ్వకు. ఒకవేళ ఇవ్వవలసివస్తే ఈ డబ్బు నాది కాదనుకొని మరీ ఇవ్వు." అప్పుడు అతడు తిరిగి ఇస్తే సంతోషించవచ్చు. ఒకవేళ ఇవ్వకపోయినా బాధ వుండదు. ఈ ప్రెపరేషన్ ముందుగా కనుక నీకు లేకపోతే ఏమవుతుందో తెలుసా! అటు డబ్బు పోవడమే కాక ఇటు లేనిపోని బాధ కూడ కొని తెచ్చుకున్న వాడవవుతావు." అని అన్నారు స్వామి.

"ఎవడో కాని బాగా చెప్పాడండి" అన్నాడతడు.

"ఎవరో ఏముంది? మనలాగానే ఇచ్చి బాగా ఢక్కా ముక్కీలు తిన్నవాడయి చివరికి లోకం మేలు కోరి ఇలా చెప్పి ఉంటాడు. ఇంతకూ ఇప్పుడు నువ్వేం చేస్తావు?" అడిగారు స్వామి.

"ఏం చేయమంటారు?" అన్నాడతను.

చేయగలిగితే బొడ్లో చెయివేసి వసూలు చేయ్. లేదా ఇక ఆ ఊసెత్తకు. వాడిస్తే సంతోషించు. లేకపోతే అంతే! ఊరికే మానసికంగా గింజుకోకు. దీనికి కూలెవరిస్తారు చెప్పు" అంటూనే తన పనిలో నిమగ్న మయినారు స్వామి.

## అంతరాయం

మీరేదో వ్యాసంగంలో ఉన్నారు. మధ్యలో వచ్చిన నేను మీ కంతరాయం కల్గించినట్లున్నాను. క్షమించాలి. ఇక సెలవా మరి! అన్నారొక నడివయస్కులు.

చనువుతో చిలిపిగా చూస్తూ ఇలా అన్నారు స్వామి. "మన కంతరాయం ఏముంది? ఎప్పుడో ఒకప్పుడు ఎక్కడో అక్కడ ఇది అంతా రాయం."

"అమ్మో! కొట్టారు దెబ్బ. మీతో మాట్లాడితే ఇక ఏదో ఒక పుస్తకంలోకి ఎక్కినట్లే. మీరు సామాన్యులా! ఏ వ్యక్తితో మాట్లాడినా, ఏ రీతిలో మాట్లాడినా, మీరీ జాతితో మాట్లాడుతున్నారు. అది నాకు తెలుసును నిజమే అంతా రాయబడవలసిందే. గీత ఒకరి సొత్తు కాదు కదా! మాలాంటివాళ్ళు నిమిత్తమాత్రులు." అంటూ మురిసిపోతూ సెలవు తీసుకున్నాడాయన.

# రెక్కలు కట్టుకొని

"కష్టమొచ్చినా సుఖమొచ్చినా రాకుండా ఉంటారా, అంటే వస్తారు. వచ్చినవాళ్ళు తృప్తిగా ఉంటారా అంటే పూటకొకసారి రాక పోకల కింతౌతుందనీ, అంత అవుతుందనీ లెక్కలు కట్టుకుంటూ ఉంటారు. అంత లెక్కలు కట్టుకునేవాళ్ళు అసలెందుకు రావాలీ? ఇవతల వాళ్ళు ఏమైనా అనుకొని పోతారనేగా? ఆ అనుకునేదేదో ఇంకోరకంగా ఇప్పుడూ అనుకుంటున్నాం కదా! ఏమిటో మాష్టరుగారూ! ఈ లెక్కలు కట్టుకునే మనస్తత్వాలూ పిఱ్ఱ్యనూ!" అంటూ కష్టసుఖాలను చెప్పుకొస్తోంది ఒకామె

ఆమె మాటలకు స్పందించిన స్వామి ఇలా అన్నారు. పూర్వ కాలంలో బంధుమిత్రులు తమవారిలో ఎవరికి కష్టం వచ్చినా, సుఖ మొచ్చినా రెక్కలు కట్టుకొని మరీ వాలేవారు. ఇప్పుడు లెక్కలు కట్టుకొని వాలుతున్నారు. చూశావా ఎంత చిత్రమో! మానవ మనస్తత్వాల్లో అంత లోనే ఎంత మార్పు వచ్చిందీ మనం పడిపోతున్నాం. చాలా స్పీడుగా పడిపోతున్నాం. ఏ విషయంలో? అనురాగాలు, అనుబంధాల విషయంలో.

స్వామి మాటలకు ఓదార్పు చెందిన ఆమె కన్నుల్లో నైరాశ్యం తొలగి తెలియని తృప్తి ఒకటి మెరయసాగింది.

## ఆదరా బాదరా

ఎక్కణ్ణుంచయ్యా వస్తున్నావు? అడిగారు స్వామి దూసుడుగా వస్తున్న యువకుణ్ణి చూస్తూ.

"హైదరాబాదు నుండండీ!" అన్నాడతను.

"ఆహా! నువ్వు ఆదరా బాదరాగా వస్తున్నప్పుడే అనుకున్నాను. ఇతను వెళ్ళింది హైదరాబాదురా! అని, ఇంతకూ వెళ్ళినపని ఏమైంది? అన్నారు స్వామి.

"మనకు ఫర్‌గానే అయింది మాష్టరుగారు" అంటూ కొంచెంగా ఊగాడతడు.

"బాగుంది. నీ హైరానాలో ఈ ఆనందం కూడా కల్సిందన్న మాట" అంటూ అభినందించారు స్వామి.

ఈ చినుకుతో స్వామి పలుకులు - స్వాతి చినుకులు పూర్తి అవుతుంది" అని చెప్పాను స్వామితో.

స్వామి ఇలా అన్నారు. అదరా బాదరాతో ఈ భాగాన్ని పూర్తి చేస్తున్నాను. కాని ఆదరా బాదరాగా మాత్రం పూర్తి చేయలేదు. అలాగే మీరు కూడ ముచ్చటగా నింపాదిగా ఈ చినుకులను చదువుకోండి. ఆదరా బాదరాగా మాత్రం చదువుకోకండి." అని చెప్పు పాఠకులకు. అలాగే స్వామి పలుకులు–స్వాతి చినుకులు మూడవ భాగాన్ని కూడ ముచ్చటగా తయారుచేసి సాధ్యమయినంత త్వరలో అందిస్తామని చెప్పు. ఆదరా బాదరాగా కాకుండా ఆడుతూ పాడుతూ అందరూ జీవించాలని ఈ శుభ సందర్భంలో కోరుతున్నామని చెప్పు" అంటూ మంగళా శాసనం చేశారు స్వామి.

—:o:—